## మంచిరెడ్డి కుటుంబ చిత్రాలు



శ్రీ వెంకట నారాయణ రెడ్డి, శ్రీమతి జయమ్మ దంపతులు మనుమనితో



శ్రీ జలంధర్ రెడ్డి, శ్రీమతి సుమిత్రమ్మ దంపతులు, తమ పుత్రులతో



శ్రీమతి సుగుణ తమ కుమార్తె ప్రసన్న లక్ష్మితో కొడుకు రాజారాంకరణ్‌రెడ్డితో కోడలు అనితతో

# అమృతోత్సవ సంస్మరణం

## కీ॥శే॥ శ్రీ మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డి



రచన : డా॥ కసిరెడ్డి




Regd. No. 250/75

ప్రచురణ

జాతీయ సాహిత్య పరిషత్

భాగ్యనగర్ శాఖ, ఆంధ్రప్రదేశ్

# అమృతోత్సవ సంస్మరణం

## కీ॥ శే॥ శ్రీ మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డి


రచన - డా॥ కసిరెడ్డి

ప్రచురణ : చిత్రభాను సం॥ర పుష్యమాసం
2003 జనవరి 12

ప్రతులు : 1000

ప్రచురణ సంఖ్య : కసిరెడ్డి సాహితీ త్రింశతి : 14

ప్రచురణ :
జాతీయ సాహిత్య పరిషత్
3-4-705/4
భాగ్యనగర్ శాఖ, నారాయణగూడ
హైదరాబాద్ - 500 029

ప్రతులకు :
మంచిరెడ్డి వెంకట నారాయణరెడ్డి
అమృతా అపార్టుమెంట్స్, వినయనగర్ కాలని
సైదాబాద్, హైదరాబాద్ - 59
ఫోన్ : 24071890

ముద్రణ :
కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్,
40, ఎపిహెచ్,
విద్యానగర్, హైదరాబాద్ - 44
ఫోన్ : 27618261, 27653348

అమూల్యం ——— ఆత్మీయ బంధువులకు, సాహితీ ప్రియులకు


ఎందరో మహానుభావులు అందరికీ వందనములు

# ఇదీ చదవండి !

ఒక వ్యక్తి వేయి పున్నమలు దర్శిస్తే, సహస్ర మాస పూర్ణ చంద్రోత్సవం జరుపుతారు. అరవై యేళ్లప్పుడు షష్టిపూర్తి చేస్తారు. డెబ్బయికి సప్తతి చేస్తారు. కొందరు డెబ్బయి అయిదుకు వజ్రోత్సవం నిర్వహిస్తారు. ఇవన్నీ తప్పనిసరిగా జరుపుకోవాలని ఏం లేదు. జరుపుకొన్న వాళ్ళకు జరుపుకొన్నంత; చేసుకొన్న వాళ్ళకు చేసుకొన్నంత.

ఇక సహస్రమాస చంద్రోత్సవం. దీనినే అమృతోత్సవం అంటారు. ఎక్కువ నెలలు కలుపుకొంటే కొద్ది అటునిటుగా 82 సం॥లకు వేయి పున్నమలు పూర్తవుతాయి. 'శతాయుః పురుషః' అనేది ఆదర్శం కాదు ఆచరణలోఉండాలని. అయితే 2003 జనవరి 1వ తేదీనాడు శ్రీ రెడ్డి గారు పరమపదించారు.

ఇన్నాళ్ళు జీవించి ఏం చేశామని వెనక్కు చూసుకోవడానికి, ముందు నడవడానికే ఈ ఉత్సవాలు. శ్రీ మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డి గారి విషయంలోనూ అంతే. వారి జీవితంలోని కొన్ని ఘట్టాలతో నిర్మాణమైన చిన్ని గ్రంథం ఇది. అమృతోత్సవం కానుకగా పంచిపెట్టేదే కాని ఇందులో గుర్తుంచుకోనేవేముంటాయి అని కొందరనవచ్చు. అవును, అందరం అతి సాధారణ మానవులమే. అయినా మనకు కొన్ని గుర్తుంచుకోదగ్గవి ఉన్నాయి, ఉంటాయి అవి అధ్యయనం చేద్దాం!

ఇది వ్రాయడానికి ప్రోత్సహించిన వారు శ్రీ బద్దం ప్రతాపరెడ్డి గారు, శ్రీ వేణుగోపాల రెడ్డి గారు, శ్రీమతి అనంతమ్మ గారు, వారి కోడలు శ్రీమతి సుజాతారెడ్డి గారు. ఇది ఇలా రూపుదిద్దుకోవడానికి సహకరించారు. మిత్రులు సంపత్కుమార గారి పాత్ర ఉండనే ఉంది.

30 సం॥ల నా సాహిత్య సేవలో 2002వ సం॥లో ఇప్పటికి 13 పుస్తకాలు వచ్చాయి. ఇది 14వ పుస్తకంగా భావించి సాహితీ త్రింశతి - 14 అని కూడా పరిగణించడం జరిగింది. ఈ గ్రంథ నిర్మాణంలో, ప్రచురణలో సహకరించిన అందరికీ ధన్యవాదాలు.

భాగ్యనగర్

12 జనవరి 2003

**డా॥ కసిరెడ్డి**
కార్యదర్శి, జాతీయ సాహిత్య పరిషత్, ఆం.ప్ర.

# భక్తి - ప్రార్థన

శాంతాకారం భుజగశయనం
పద్మనాభం సురేశం
విశ్వాధారం గగన సదృశం
మేఘ వర్ణం శుభాంగమ్ ।
లక్ష్మీకాంతం కమల నయనం
యోగిహృద్ధ్యానగమ్యం
వందే విష్ణుం భవభయహరం
సర్వలోకైక నాథమ్॥

మేఘశ్యామం పీతకౌశేయ వాసం
శ్రీ వత్సాంకం కౌస్తుభోద్భాసితాంగమ్ ।
పుణ్యో పేతం పుండరీకాయతాక్షం
విష్ణుం వందే సర్వలోకైక నాథమ్॥

లక్ష్మీం క్షీర సముద్ర రాజ తనయాం
శ్రీరంగ ధామేశ్వరీం
దాసీభూత సమస్త దేవవనితాం
లోకైక దీపాంకురామ్ ।
శ్రీమన్మంద కటాక్షలబ్ధ విభవత్
బ్రహ్మేంద్ర గంగాధరాం
త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం
వందే ముకుంద ప్రియామ్ ॥



# భక్తి - పద్యములు

చేతులారంగ శివుని పూజింపడేని
నోరు నొవ్వంగ హరి కీర్తి నుడువడేని
దయయు సత్యంబు లోనుగా దలపడేని
కలుగనేటికి తల్లుల కడుపుచేటు.

తల్లీ నిన్ను దలంచి పుస్తకము చే
తన్ బూనితిన్, నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా
నుక్తుల్ సుశబ్దమ్ము శో
భిల్లన్ బల్కుము నాదు వాక్కునను సం
ప్రీతిన్ జగన్మోహినీ
పుల్లాబ్జాక్షి సరస్వతీ భగవతీ భారతీ
పూర్ణేందు బింబాననా!

శ్రీ కైవల్యపదంబు జేరుటకునై
చింతించెదన్ లోక ర
క్షైకారంభకు భక్తపాలన కళా
సంరంభకున్ దానవో
ద్రేకస్తంభకు కేళిలోల విలసత్
దృగ్జాల సంభూతనా
నాకంజాత భవాండకుంభకు మహా
నందాంగనా డింభకున్.

# విషయ సూచిక



# అమృతోత్సవ సంస్మరణం

**కీ॥శే॥ శ్రీ మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డి**

## 1. తలపై పెద్ద గాయం

1947వ సంవత్సరం.

రాత్రి వేళ.

భయం కలిగించే సమయం. ఎక్కడా ఏమీ కనిపించడం లేదు.

ఏవో అడుగుల చప్పుళ్లు. ఏమిటీ చప్పుళ్లు ఇంత రాత్రి వేళ జీతాలు చేసే వారెవరూ రారు. కాని ఈ సమయంలో ఆ అడుగుల చప్పుడు;

ఎవరో లైటు వేస్తున్నారు; ఆపుతున్నారు. ఎవరికో ఎవరో దారి చూపిస్తున్నారు. ఎవరో రావడానికి ఎవరో సిగ్నల్స్ ఇస్తున్నారు.

ఇంట్లో గ్యాసునూనె దీపం. మరో వెలుగు లేదు. 'ఎవరో వస్తున్నారు' ... అని పరిశీలనగా చూస్తున్న వదిగారన్నారు.

'ఎవరో వస్తున్నారు. లైటు వేసి ఆర్పుతున్నారు. ముఖాలకు జాలీలు (ముసుగులు) ఉన్నాయి...' అన్నారు వదినగారు.

వారు ఇంటిలోనికి వచ్చారు. 'రాంచంద్రారెడ్డి ఎక్కడరా' అన్నారు.

రాంచంద్రారెడ్డి తన అన్న; తన కన్నా పెద్దవారు. అన్నదమ్ముల్లో ఆయన మూడోవారు; తాను నాల్గోవాడు.

'ఇంట్లో లేడు' అన్నాడు మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డి.

'ఎక్కడున్నాడో చెప్పు' తుపాకి గురిపెట్టి అడిగాడు... 'బోలో బోలో హెక్కడున్నాడ్'.. అన్నాడు.

'తెలవదు' అన్నాడు రెడ్డి.

వాడు బూతులు తిడుతూ తుపాకితో గుద్దాడు; మరొకడు జంబ్యాతో నెత్తిన పొడిచాడు.

అంతే మంచిరెడ్డి వేణుగోపాల రెడ్డి పడిపోయాడు; మూర్ఛపోయాడు.

'అయ్యో! అయ్యో! అంటూ ఇంటిల్లిపాది ఏడుస్తున్నారు.

'చుప్, చుప్...' అంటూ ఇల్లంతా దోచుకొని, తిరిగి తిరిగి వెతికి వెతికి అందరికీ తుపాకులు చూపిస్తూ జంబ్యాలు తిప్పుతూ అందరినీ భయభ్రాంతులను చేస్తూ వెళ్లిపోయారు.

క్రిందపడిపోయిన వేణుగోపాలరెడ్డి స్పృహ తప్పుతూనే నారాయణ కవచం చదువుకొంటున్నాడు. స్పృహలోకి వస్తూ కూడా నారాయణ కవచమే ఒక మంత్రంగా స్మరిస్తున్నాడు; ధ్యానిస్తున్నాడు; జపిస్తున్నాడు. ఆ మంత్రమిది...

## 2. శ్రీమన్నారాయణ కవచం

కం॥ వరనారాయణ కవచము
నరిభీకర వజ్ర కవచ మాశ్రిత సంప
త్పరిణామ కర్మ సువచము
పురుహూతునకెట్లుమౌని బోధించె? తగన్ - 6-296

వ॥ అనినంబరీక్షిజ్జనపాలునకు మునినాథుండిట్లనియె - 6-297



సీ॥ వినవయ్య ! నరనాథ ! మునినాథు డింద్రున
కనువొంద నారాయణాఖ్యమైన
కవచంబు విజయ సంకల్పంబునప్రమే
య స్వరూపంబు మహా ఫలంబు
మంత్ర గోప్యము హరి మాయావిశేషంబు
సాంగంబుతోడ నెఱుంగ జేసె
దానినే వినిపింతు పూనితదేకాగ్ర
చిత్తంబు తోడుత చిత్తగింపు

మొనర ధౌతాంఘ్రి పాణియై యుత్తరంబు
ముఖముగా నుత్తమాసనమునవసించి
కృత నిజాంగ కరన్యాస మతిశయిల్ల
మహిత నారాయణాఖ్య వర్మము నొనర్చె - 6-298

వ॥ ఇట్లు నారాయణ కవచంబు ఘటించి, పాదంబులను జానువులను, ఊరువులను, ఉదరంబునను, హృదయంబునను, ఉరంబునను, ముఖంబునను, శిరంబునని ట్లష్టాంగంబులం బ్రణవ పూర్వకంబైన యష్టాకరీ మంత్రరాజంబు న్యాసంబు జేసి, ద్వాదశాక్షర విద్యచేత కరన్యాసంబు చేసి, మంత్రమూర్తియై (ప్రణవాది యకారాంతమగు మహామంత్రంబుచేత నంగుళ్యంగుష్ఠ పర్వసంధులయందు న్యసించి, మఱియు హృదయంబున ఓంకారంబు, వికారంబు మూర్ధంబున, షకారంబు భ్రూమధ్యంబునందు, ణకారంబు శిఖయందు, వేకారంబు నేత్రంబుల యందు, నకారంబు సర్వసంధులయందు, మఱియు నస్త్రము నుద్దేశించి మకారంబును న్యసించెనేని మంత్ర మూర్తియగు. మఱియును అస్త్రాయఫట్ అను మంత్రంబున దిగ్బంధనంబు చేసి, పరమేశ్వరునిఁ దనభావంబున నిల్పి) భగవచ్ఛబ్ద వాజ్యంబును, విద్యామూర్తియు దపోమూర్తియునగు (షట్ఛక్తి సంయుతంబైన) నారాయణ కవచాఖ్యమైన మంత్ర రాజంబు నిట్లని పఠించె (భాగ - 6-299)

..... ..... ..... ..... ..... ..... .....

సీ॥ తాటకమర్దించి తపసి జన్నము గాచి
హరివిల్లు విఱిచి ధైర్యమున మెఱసి
ప్రబలులైనట్టి విరాధకబంధోగ్ర
ఖర దూషణాది రాక్షసుల దునిమి
వానర విభునేలి వాలి గూలగ సేసి
జలరాశి గర్వంబు ఁజక్కఁజేసి
సేతువు బంధించి చేరి రావణ కుంభ
కర్ణాది వీరులఁగడిమిఁద్రుంచి

తే॥ యలవిభీషణులంకకు నధిపుఁజేసి
భూమి సుతఁగూడి సాకేత పురమునందు
రాజ్యసుఖములు గైకొన్న రామవిభుఁడు
వరుసనను ఁబ్రోచుచుండు ఁబ్రవాసగతుల (భాగ - 6-306)

క॥ అనుదినము దీని నెవ్వరు
వినిరేని పఠించిరేని విస్మయమొదవన్
ఘనభూతజాలమెల్లను
మునుకొని వారలను గాంచి మ్రొక్కుచునుండున్.
(భాగ- 6-312)

(నారాయణ కవచం శ్రీ మహాభాగవతంలోని ఆఱవ స్కంధంలో 296 నుండి 313 వరకున్న గద్య పద్యాలలో ఉంది.)

- శ్రీ వేణుగోపాలరెడ్డి ఆ విధంగా గాయపడి అప్పుడు గుర్తుకు వచ్చినంత చదువుకొంటూనే ఉన్నాడు. అందరూ 'అయ్యో! అయ్యో! అంటూ ఏడుస్తున్నారు. నెత్తినుండి కారుతున్న రక్తం తుడుస్తున్నారు'. కొందరు 'ఈ రజాకర్లు పాడుగాను, వీళ్ల మీద దుమ్ము వొయ్య' అని తిడుతున్నారు. 'దేవుడా కాపాడు' అంటున్నారు. కొందరు వైద్యుని కొఱకు పరుగెత్తారు. ఈలోగా ఊరి జనంలో కొందరు మెల్ల మెల్లగా ఇంటి వైపు వచ్చారు. ఊళ్లోని నాటువైద్యుడు పసరు పిండాడు. నెత్తికి కట్టు కట్టారు.



ఇవన్నీ జరుగుతూనే ఉన్నాయి. కానీ, రెడ్డి నారాయణ కవచం చదువు కొంటున్నాడు.

విశ్వాసాలు అటువంటివి. శ్రీమన్నారాయణ కవచం మృత్యువు నుండి కాపాడుతుందని నమ్మకం. అయ్యవార్లు, పంతుళ్లు, పురోహితులు ఈ ప్రచారం చేసేవారు. అంతేకాక "అర్జున, ఫల్గుణ, పార్థ, కిరీటి, బీభత్స, శ్వేత వాహన, విజయ, కృష్ణ, సవ్యసాచి, ధనంజయ"... ఈ దశ విధ నామాలు చదివితే పిడుగుగానీ, పిడుగులాంటి ఆపద గానీ దూరంగా వెళ్లిపోతాయనే విశ్వాసం జనంలో ఉండేది.

ఆ తర్వాత 'శ్రీ ఆంజనేయం, ప్రసన్నాంజనేయం, ప్రభాదివ్యకాయం...' అంటూ ఆ వజ్రాంగబలుడైన (భజరంగబలి) ఆంజనేయుణ్ణి స్మరిస్తే కూడా దరిచేరే ఆపదలు దూరమవుతాయనే విశ్వాసం జనంలో ఉండేది. ఇవి ప్రగాఢంగా నాటుకొన్న నమ్మకాలు.

ఆఁ...ఇవి మూఢ నమ్మకాలు. వచ్చే ఆపదలు ఎట్లాగైనా వస్తాయి. ప్రాణం పోతుంటే పట్టుకొని నిలిపేవేవీ లేవు.. అనేవారు అప్పుడు ఇప్పుడూ ఎప్పుడూ ఉండనే ఉంటారు.

తాత్కాలికంగా ఆ భయం నుండి ఇవి దూరం చేస్తాయి. అంతేకాక మనస్సులో ఒత్తిడి తగ్గుతుంది. మనశ్శాంతి ఏర్పడుతుంది. ఉద్వేగాలకు లోనై మనిషి డిప్రెషన్‌లోకో, బీపీలోకో వెళ్ళకుండా ఇవి తోడ్పడుతాయి అని మనస్తత్త్వ శాస్త్రవేత్తలు అంటారు. ఏది ఏమైనా ఇదొక వైద్య చికిత్స వంటిది. మనస్సుపై ప్రభావం వేసి మనిషిని చెక్కుచెదరకుండా నిలిపే శక్తి శ్రీమన్నారాయణ కవచానికి, అర్జునుని దశవిధ నామాలకు, శ్రీ ఆంజనేయ ప్రసన్నాంజనేయానికి ఉంది.

ఉంది అనే విశ్వాసం ఉన్న వారైనందువల్లనే మందులు చేసే పనులు చేస్తుండగానే, ఈ మంత్రాలు తమ పనిచేశాయన్నట్టుగా ఈ మహా ఆపద నుండి, ప్రాణాలతో బయటపడ్డారు శ్రీ మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డి.

# 3. పుట్టు పూర్వోత్తరాలు - జన్మభూమి

శ్రీ మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డి గారి స్వగ్రామం రంగారెడ్డి జిల్లాలో ఉన్న వీర పట్టణం (ఇబ్రహీంపట్నం) మండలంలోని వెలిమినేడు గ్రామం. వ్యవహారంలో ఎలిమినేడు అని కూడా పిలుస్తారు. శ్రీ రెడ్డి సిద్ధార్థ సం॥ చైత్ర బ॥ త్రయోదశి నాడు అంటే 1919 సం॥లో జన్మించారు. ఉత్తరాభాద్ర నక్షత్రం వీరిది. వ్యవసాయదారుల కుటుంబం. పది మందికి అన్నంపెట్టే వ్యవసాయ వృత్తి.

తల్లిదండ్రులు శ్రీమతి రంగమ్మ, వెంకట్రామరెడ్డి. తాత చెంచిరెడ్డి; ముత్తాత ముత్యం రెడ్డి.

రంగమ్మ వెంకట్రామారెడ్డి దంపతులకు ఆర్గురు కుమారులు. వరుసగా వారి పేర్లివి. 1. శ్రీ చెంచిరెడ్డి, 2. శ్రీ హరి కిషన్ రెడ్డి, 3. శ్రీ రాంచంద్రారెడ్డి, 4. శ్రీ వేణుగోపాల్ రెడ్డి, 5. శ్రీ భూపాల్ రెడ్డి, 6. శ్రీ రఘునందన్ రెడ్డి.

ఆ దంపతులకు నలుగురు కూతుళ్లు. వరుసగా వారి పేర్లివి. 1. శ్రీమతి రామచంద్రమ్మ, 2. శ్రీమతి రత్నమ్మ, 3. శ్రీమతి లక్ష్మమ్మ, 4. శ్రీమతి రాధమ్మ.

ఆరుగురు అన్నదమ్ములలో శ్రీ వేణుగోపాలరెడ్డి నాల్గవవారు. కుటుంబాలు పెద్దవి. కడుపు నిండా కనిన తల్లికి గౌరవమున్న కాలమది. వ్యవసాయదారుల కుటుంబాలలో, కూలీనాలీ చేసుకొన్నవారిలో ఎంత మంది ఎక్కువగా ఉంటే అంతగా కుటుంబం వికసిస్తుందని భావిస్తారు. అందరూ పనిమంతులైతే, నాలుగు చేతులు సంపాదిస్తాయని, దాని వల్ల ఆర్థికంగా కుటుంబం బలపడడానికి వీలవుతుందని వారి ఆలోచన. అబ్బాయి ఎదిగివస్తే వ్యవసాయంలో తనకు తోడుంటాడని తండ్రి, అమ్మాయి ఎదిగి వస్తే ఇంటి పనులలో తనకు తోడుగా ఉంటుందని తల్లి భావించేవారు. జనాభా సమస్య లేదు. భూములు సుక్షేత్రాలు కాకున్నా, జలాధారిత వ్యవసాయం కాకున్నా, ఇంతమంది సంతానమే అని చింతించలేదు. పెద్ద పెద్ద ఇండ్లు. సువిశాలంగా ఉన్న వ్యవసాయ క్షేత్రాలు. లెక్కలేనంత భూమి బీడుగా ఉన్నా పండించిన దాంట్లోనే పది మందికి పెట్టే స్తోమత ఉండేది.



అటువంటి పెద్ద కుటుంబంలో చింతావంతా లేని చిక్కని చక్కని కుటుంబంలో వేణుగోపాలరెడ్డి దినదిన ప్రవర్ధమానమవుతున్నాడు.

వెలిమినేడు రంగారెడ్డి జిల్లాలో (ఇప్పుడు) ఉందనుకొన్నాం కదా!

1919 ప్రాంతంలో ఇది నిజాం ఏలుబడిలో ఉండేది. 7వ నిజాం మీర్ ఉస్మాన్ ఆలీ పాలన. శ్రీ రెడ్డి పుట్టుక కాలంలో ఈ నిజామే నిజాంల (అసఫ్జాహీల) వంశంలో చివరి రాజవుతాడని ఎవరూ అనుకోలేదు. పైగా శాశ్వత కాలాల పాటు నిజాం ప్రభువుల పాలన ఉంటుంది అనుకొనేవారు.

పరిపాలకుల భాష వేరు; మతం వేరు; సంప్రదాయాలు వేరు; సంస్కృతి వేరు. వారి ఏలుబడిలోని హైదరాబాదు రాష్ట్రంలో నూటికి 98 మంది హిందువులే. ఈ హిందువులలో తెలుగువారున్న పెద్ద భాగమే తెలంగాణ. వీరి మాతృభాష తెలుగు. అయినా ఉర్దూలోనే రాజకీయ - పాలనా వ్యవహారాలు సాగుతుండేవి. మిగతా రెండు భాగాలలో మహారాష్ట్రులు, కన్నడిగులు ఉండేవారు. వారి మాతృభాషలు మహారాష్ట్ర - కర్ణాటకలు. మరాఠీ - కన్నడాలు అని కూడా పిలుస్తారు. ఈ ముగ్గురిపై ఉర్దూ భాష పెత్తనం చలాయిస్తుండేది. ఆ కారణంగా ఆయా కుటుంబాల వారు అందులో వనరులు ఉన్నవారు తమ పిల్లలకు మాతృభాషలతో పాటు (తెలుగు, మరాఠి, కన్నడాలతో పాటు) ఉర్దూ కూడా నేర్పించేవారు. మరీ కొందరైతే పాలకుల భాషలకే మాతృకలైన అరబ్బీ, పారసీలు చదివించేవారు. ఆ విధంగా తురక చదువులు తెలంగాణాలో ప్రభావితం చూపడం, మద్రాసు క్రింద నున్న తెలుగు వారు ఈ ప్రాంతాన్ని తౌరుక్యాంధ్రం అని పిలవడం జరుగుతుండేది. ఇటువంటి పరిస్థితులలో శ్రీ వేణుగోపాలరెడ్డి బాల్యం - చదువులు ఏ విధంగా ఉన్నాయో చూద్దాం.

## 4. బాల్యం - చదువులు

విద్య వలనను వినయమ్ము; వినయమునను
బడయు పాత్రత; పాత్రత వలన ధనము;
ధనము వలనను ధర్మమ్ము; దాని వలన
ఐహికాముష్మిక సుఖంబు నందు నరుడు.

- విద్య వలన వినయం పెరుగుతుంది. వినయం వల్ల యోగ్యత వస్తుంది. యోగ్యతను బట్టి ద్రవ్యం సమకూరుతుంది. ద్రవ్యం వల్ల ధర్మకార్యాలు చేయవచ్చు. ధర్మం వల్ల ఇహపర సుఖాలను ఈ మానవులు పొందుతారు.

ఈ భావమున్న పై పద్యానికి భర్తృహరి వ్రాసిన మూల శ్లోకం 'విద్యాదదాతి వినయం...' అనేది. దానికి తెలుగు చేసిన వారు ఏనుగు లక్ష్మణ కవి.

ఇటువంటి పద్యాలు పల్లెల్లో కాన్గీ (ప్రైవేటు) పాఠాలు చెప్పే పంతుళ్లకు వచ్చేవి. ఇవే కావు, వారికి శతక పద్యాలు, భాగవతంలో రుక్మిణీ కల్యాణ ప్రహ్లాద చరిత్రల పద్యాలు నోటికి వచ్చేవి. ఎవరు వ్రాశారో తెలియని పద్యాలు కూడా వారి నోట రాగయుక్తంగా వచ్చేవి.

ఈ పంతుళ్లలో చాలా గ్రామాలలో పురోహితులే ప్రధాన పాత్ర వహించేవారు. కొన్ని గ్రామాలలో కొద్దిపాటి తెలుగు వచ్చే ముస్లింలే మౌల్వీ సాహెబులై 'చౌచౌ తెలుగు' చెప్పేవారు. పిల్లల్ని ఉర్దూ వైపు మొగ్గించే వారు. ఇస్లాంలోకి మతాంతరీకరణ చేయబడిన దూదేకుల వారు (లద్దాక్, పింజారీలు) కూడా అక్కడక్కడ పంతుళ్లుగా చలామణి అయ్యేవారు. చాలా గ్రామాల్లో భట్రాజులు చదువు పంతుళ్లయి పాఠాలు చెప్పిన దాఖలాలు కనిపిస్తున్నాయి. వెలిమినేడు గ్రామంలో కూడా కొంగరకు చెందిన పాపరాజనే భట్రాజు పాఠాలు చెప్పేవారు.

అయితే గుడి అరుగుమీదనో, కొంత మంది ఇళ్ల ముంగిటి అరుగుల మీదనో ఈ బళ్లు నడిచేవి. కొద్దిపాటి ఉన్నవారు, ఓ కొట్టం (పాక) వేయించి ఊళ్లల్లో బళ్లు నడిచేట్టుగా చేసిన వదాన్యులున్నారు.



శ్రీ మంచిరెడ్డి వంశం వాళ్లది మంచి కుటుంబం. పూర్వీకులు దానధర్మాలు చేసి మంచి పేరు సంపాదించిన కారణంగానే వారింటిపేరు మంచిరెడ్డి అయిందని చెప్పుకొంటారు. ప్రతి ఇంటి పేరు వెనుక ఓ మంచి కథ ఉంటుంది. వేణుగోపాలరెడ్డి తాతగారి పేరు చెంచిరెడ్డి కదా! ఆయనను అందరు మంచిరెడ్డి అనే పిలిచేవారు. చెంచిరెడ్డి ఓ కుటుంబంలో జరిగే పెళ్లి ఆగిపోకుండా ఆదుకొన్నారు. ఓ పేద కుటుంబంలో పెళ్ళికి అన్నీ ఏర్పాట్లు చేసుకొన్నారు. మరో రెండుగంటల్లో పెళ్లి అనగా ఆ యింట్లో మంగళసూత్రం మాయమై పోయింది. ఏం చేయాలో పెళ్ళి కూతురు తండ్రికి పాలుపోలేదు. ఈ సంగతి చెంచిరెడ్డికి తెలిసింది. ఆయన తన చేతి ఉంగరాన్ని పేద వ్యవసాయదారునికిచ్చాడు. వెనుకటికి మహాదాతలైన రెడ్లెందరో ఉన్నారని విన్నాడు, కాని ఆ దాతలింత మంచి రెడ్లన్న మాట. అది వరకే ఆ కుటుంబానికి మంచి రెడ్ల వంశమనే ముద్ర ఉంది. ఇప్పుడు చెంచిరెడ్డి మరీ మంచి రెడ్డి అయ్యాడు. అలాంటి తాతగారి మనుమల్లోనూ మంచి రెడ్లే ఉంటారు మరి!

అలాంటి మంచిరెడ్ల ఇంటికి వచ్చి పాఠం చెప్పడానికి కొంగర గ్రామం పాపరాజు ఇష్టపడ్డాడు. ఇంకేం ఇంట్లోనే పాఠాలు.

మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డి పంతులు చెప్పిన పాఠాలు మంచిగా నేర్చుకొంటున్నాడు. ఓనమాలు (ఓం మాల = ఓం తో మొదలయ్యే వర్ణమాలకే ఈ పేరు వచ్చింది) గుణింతాలు (కాకుర్తం), పదాలు, వాక్యాలు, పద్యాలు ఇలా వరుసగా పంతులుగారు నేర్పుతున్నారు.

పెద్ద బాలశిక్ష ప్రధానంగా గ్రహించి బోధన జరుగుతున్నది. 'ఖర్జూర ఫలములు గణికుండు కొనితెచ్చి, సగపాలు మోహంపు సతికినిచ్చె...' వంటి పద్యాలు నోటికి పడుతున్నాయి. ఎన్నో సామెతలు, పదబంధాలు నోట నానుతున్నాయి. చిన్న, చిన్న లెక్కలూ చిన్నారి రెడ్డి చేస్తున్నాడు.

శ్రీ రాముల దయసేతను
నారూఢిగ సకల జనులు నౌరాయనగా
ధారాళమైన నీతులు
నోరూరగ చవులు పుట్ట నుడివెద సుమతీ!

అప్పిచ్చువాడు వైద్యుడు,
ఎప్పుడు ఎడతెగక పారు నేరును, ద్విజుడున్,
చొప్పడిన ఊరు నుండుము,
చొప్పడకున్నట్టి యూరు చొరకుము సుమతీ!

బద్దెన రచించిన సుమతీ శతకం లోని ఇటువంటి పద్యాలు శ్రీ రెడ్డికి పట్టువడ్డాయి. వాటిని అలవోకగా చదువుతున్నాడు. అదే విధంగా భక్తి భావభరితమైన కృష్ణ శతకం లోని పద్యాలు నోటికి వచ్చాయి. అందులో ఒకటి, రెండు చూద్దాం.

హరియను రెండక్షరములు
హరియించును పాతకంబులంబుజనాభా
హరి నీనామమహాత్మ్యము
హరి హరి పొగడంగ వశమె హరి శ్రీ కృష్ణా!

దండమయా విశ్వంభర
దండమయా పుండరీకదళ నేత్ర హరీ!
దండమయా కరుణానిధి
దండమయా నీకు నెపుడు దండము కృష్ణా!

అంత చిన్నతనంలో భక్తి అంటే ఏమిటో తెలియకపోవచ్చు. ఆ పంతులు గారికి కూడా పెద్దగా వివరించే శక్తి లేక పోవచ్చు. కాని చిన్నవారికి మాత్రం వాక్శుద్ధి వచ్చింది. తెలుగు పద్యం మీద చాలా మందికి మక్కువ పెరిగింది. నాలుగు పద్యాలు నేర్చుకొని 'మాకు తెలుగు భాష వచ్చిందోచ్' అనుకొన్నారు పిల్లలు. అదే విధంగా శ్రీ రెడ్డి అనుకొన్నాడు. కృష్ణ శతకంలో ఆయనకు మరీ బాగా నచ్చిన పద్యం.

నీవే తల్లివి తండ్రివి
నీవే నా తోడు నీడ నిజముగ సఖుడౌ
నీవే గురుడవు దైవము
నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా!



ఆహా! ఎంత గొప్ప పద్యం. ఇది భక్తిపరులనే కాదు, అందరినీ అలరించే పద్యం. శ్రీ రెడ్డికి అంత చిన్నతనంలో 'త్వమేవ మాతాచ - పితా త్వమేవ...' అనే శ్లోకం దీనికి మూలం అని తెలువక పోవచ్చు. పద్యంలోని అపూర్వ వేదాంతం కూడా అర్థం కాకపోవచ్చు. కాని భగవంతుడే మన తల్లీతండ్రీ అన్న ఆ ఒక్క భావన చాలు; మానవుడు పవిత్రుడైపోతాడు.

మన పూర్వీకులు ఇటువంటి పద్యాలను పూర్వం పాఠ్యాంశాలలో చేర్చి చెప్పేవారు. అందుకే పిల్లలు ఆస్తికులయ్యారు. మన తల్లీ తండ్రీ అంతా భగవంతుడే అయితే మనమూ భగవంతునిలాగా 'మంచి'నే పాటించాలి; మంచినే ఆచరించాలి అనే భావన పిల్లలలో కలుగుతుందనే ఇవి చెప్పేవారు, అదీ సదాచార దృష్టి అంటే!

ఈ పద్యాలతో పాటు చిన్నారి వేణు గోపాల రెడ్డి పది సం॥ల లోపలి వయస్సులోనే ఆంధ్ర నామ సంగ్రహం, రుక్మిణీ కల్యాణం, ప్రహ్లాద చరిత్రలు చదువుకొన్నాడు. ఆ తర్వాత మరికొంత ఎదగడం, అప్పుడు శ్రీమన్నారాయణ కవచం మీద దృష్టి నిలపడం జరిగింది.

మొత్తం మీద భట్రాజు శ్రీ పాపరాజు గురుబోధ వేణుగోపాలరెడ్డిని భాగవతం వరకు తెచ్చి నిలిపిందన్నమాట. అదీ శ్రీకైవల్యపదం.

ఆ తర్వాత ఇక శ్రీ రెడ్డిని భాగవత భక్తి వదలలేదు. తనంతకు తానే పోతన్న భాగవతం చదువుకొని పరవశించి పోవడం మానలేదు.

మరి ఈ చదువు అన్నం పెడుతుందా అని ఎవరైనా అడగవచ్చు. గోలకొండ రాజ్యంలో నైజాం రాష్ట్రంలో ఈ చదువులను ఖాతరు చేసేవారు కారు. ఉర్దూలో దువ్వం (రెండో తరగతి) సువ్వం (మూడో తరగతి) చేసిన వారికి కూడా అమీన్‌సాబ్ (ఎస్.ఐ.) లాంటి ఉద్యోగాలు వస్తున్న కాలం అది.

అందుకే ఉర్దూ నేర్చుకోవాలనే కోరిక రైతు కుటుంబాల్లోనూ కలగడం మొదలైంది. తల్లిదండ్రులలో ఉర్దూ చదువే చదవని, పిల్లల్లోనూ ఉర్దూ చదివితేనే గొప్ప విద్యావేత్త అనే దురభిప్రాయం నాటుకొంది. కారణం మరేం కాదు పాలకుల ప్రభావం.

పాలకులైన మహమ్మదీయులు 'తెలంగీ బేడంగీ' అని తిట్టేవారు. అంటే తెలుగు ఒక ముక్కూ మొగంలేని భాష అని అర్థం. ఎంత దౌర్భాగ్యం ఇది.

నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాథ, పోతన తదితరులు వ్రాసిన మహాకావ్యాలు సాహిత్యాన్ని సుసంపన్నం చేయగా - దానికి ముక్కూ మొగం లేదట. జ్ఞానమున్నవారు, భాషా రీతులను తెలిసిన ఎవరైనా ఇలా అనగలరా!

సంస్కృతంలోని అపూర్వ సాహిత్య గ్రంథాలను ఛందో, వ్యాకరణ, ధ్వని, అలంకార, శయ్యా, పాక, రీతుల ద్వారా తెలుగులోకి 'శిల్పాకృతి' ధరించే విధంగా తీర్చిదిద్దిన మహాకవులందరినీ ఈ తిట్టుతో అవమానించినట్లే లెక్క. అందుకే తెలుగు నేర్చుకోవాలి, ప్రసార ప్రచారాలు చేయాలి అనే నిష్ఠ కొందరిలో బలపడింది. అయినా వేణుగోపాలరెడ్డి మౌల్వీలను పట్టుకోవలసి వచ్చింది. ఉర్దూలో తగినంత ప్రావీణ్యాన్ని సంపాదించవలసి వచ్చింది. అందుకు తండ్రి శ్రీ వెంకట్రాం రెడ్డి పూనుకోవలసి వచ్చింది.

అలీఫ్, బే, పే, తే, టే, సే, జీం, చీంతో మొదలైన ఉర్దూ చదువు గ్రంథాలు చదివేంతవరకు, పది వాక్యాలు వ్రాసేంతవరకు వెళ్లి ఆగిపోయింది. అయితే తెలుగు - ఉర్దూలు రెండూ ఉద్యోగం కొరకు చదివినవేం కాదు.

## 5. వ్యవసాయ వృత్తి

జీవితానికి పరమాధారమైంది వ్యవసాయమే. వ్యవసాయం ఆధారంగానే ఈ దేశం ఎదిగింది. తెలంగాణాలోని రెడ్లు దాదాపుగా అందరు కూడా మొదటి నుండి వ్యవసాయం మీదనే ఆధారపడి, తాము పండించిన పంట పది మందికి అందడంలో తాము అనేక గ్రామాలలో కేంద్ర బిందువులు కాగలిగారు.

తండ్రి తాతల నుండి సంక్రమించిన వ్యవసాయంలోనే శ్రీ మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డి స్థిరపడ్డారు. పెద్దన్న రాంచంద్రారెడ్డికి ఊరిలో మంచి పేరు వచ్చింది. పది మంది ఒక కుటుంబంలో ఉంటే అందరూ వ్యవసాయం లోనే ఉన్నా సరిపోయే



కాలమది. ఉన్న వ్యవసాయ క్షేత్రం కూడా ఈ అందరి కృషి కారణంగా పెరిగిందేకాని తరగలేదు.

బాగా కష్టపడి, పంట బాగా పండిస్తే వ్యవసాయ క్షేత్రాలు పెరుగుతాయే కాని తరగవు. అదీగాక పంట పండించి పదిమందికి అన్నం పెట్టే అతి పవిత్ర కార్యం వ్యవసాయం. అందుకే శ్రీ గంగుల శాయిరెడ్డి అనే తెలంగాణా కవి 1935 ప్రాంతంలో వ్రాసిన తమ కాపుబిడ్డ అనే గ్రంథంలో ఇలా అంటారు.

'జనకుడు దేని బూని యిల జానకి గాంచి సుపూజ్యుడయ్యెనో
పనిగొనెదేని చేత బలభద్రుడు కయ్యము వచ్చినప్పుడున్
కనుకని దేని నూని భువి కాపులు దున్నిరి నాడు నేడు మా
కనిశ మదే హలంబు ధనమాయువు కీర్తిని నిచ్చిగావుతన్.'

- 'జనక మహారాజు దేని ద్వారా సీతమ్మ వారిని పుత్రికగా పొంది పూజనీయుడయ్యాడో, పోరాటాలు పొడుచుకొని వచ్చిన ప్రతి సందర్భంలో బలరాముడు దేనిని ధరించి ముందుకు సాగాడో, నాడైనా-నేడైనా ఈ భూ మండలంలోని కాపులందరు, ఈ నేలను నాగలితో దున్నారో - అటువంటి నాగలి మాకు ఎల్లప్పుడు ధనాన్ని, ఆయుష్షును, కీర్తిని ఇచ్చి కాపాడుగాక!

అవును వ్యవసాయదారులకు పంట వల్ల ధనం వస్తుంది; నిరంతరం కృషీవల జీవనం గడపడం వల్ల పచ్చని పైర్ల కారణంగా, ప్రాణవాయువులోనే జీవించిన కారణంగా ఆయుష్షు పెరుగుతుంది. పండిన పంట తమ ఒక్క కుటుంబానికే కాక పది మంది పుష్టికి - తుష్టికి ఉపయోగపడుతున్న కారణంగా కీర్తి వస్తుంది. కాపుబిడ్డలోని శ్రీ గంగుల శాయిరెడ్డి ఇటువంటి పద్యాలు చాలా మందికి నోటికి వచ్చేవి. శ్రీ వేణుగోపాలరెడ్డి కూడా ఇటువంటి పద్యాలు విన్నారు. కర్షకులకు ఏవేవి కల్పవృక్షాలో కాపుబిడ్డ గ్రంథకర్త ఇలా చెప్పారు.

గుట్టలు, కులపర్వతములు,
చెట్టులు, పుట్టలును, నదులు, చెఱువులు, వాగుల్
పిట్టలు, పశువులు, కనకపు
గట్టులవలె కర్షకులకు కల్పద్రుమముల్.

- 'నిజంగా కర్షకులకు గుట్టలు, కులగిరులు, చెట్లూ పుట్టలు, నదులు, చెరువులు, వాగులు, పక్షులు, పశువులు ఇవే బంగారు కొండలు - కల్పవృక్షాలు.'

అయితే ఈ వ్యవసాయంలో కర్షకునికి ఉండే కష్టాలు తీర్చేదెవరు? శ్రీ గంగులవారీ విషయంలో వందల పద్యాలు వ్రాశారు. అందులో ఒకటి చూద్దాం.

సీ॥ మోకాళ్ల మీదికి ముతక దోవతి జెక్కి
నెత్తి గుడ్డను విప్పి యొత్తిచుట్టి
వలపలి చేతిలో ములుగఱ్ఱ సవరించి
పాదరక్షల బూని పాలెబట్టి
కుడికేల దాపటి గోద పగ్గము బట్టి
ఎడమచే నాగలి యడచిపట్టి
క్రమముగా నొకరీతి గడ్డలదోలగా
మడక మ్రోడునదూటి యడచిపట్టి

బలము కొలదిగా కోడెలు హలములాగ
కాడికోలనో పాలెనో గదలవిఱుగ
కొత్త నాగలి చేయించి తెత్తువెపుడు
కర్షకా! నీదు పడుపాట్లు గాంతురెవరు?

-ఓయీ! కర్షకా! మోకాళ్ల పైకి ముతక దోవతి చెక్కుకొన్నావు. తలపై రుమాలును విప్పి ఒత్తి పట్టి చుట్టగా కట్టావు. కుడి చేతిలో ములుగఱ్ఱె పట్టావు. చెప్పులు తొడుగుకొన్నావు. మేడితోక ఒత్తిపట్టుకొన్నావు. కుడిచేత ఎడమ ప్రక్క కాడికున్న ఎద్దు పగ్గం పట్టావు. ఎడమచేత నాగలి మేడిని అణచి పట్టుకొన్నావు. క్రమంగా చాళుల మధ్య గడ్డ విడుస్తూ నాగలి నడిపిస్తున్నావు. నాగలి భూమిలోని వేరుకు తగలగా అణచిపట్టావు. అప్పుడు గిత్తలు బలంకొద్దీ నాగలి లాగాయి. ఏమయిందో! కాడో, నాగలి దుంపో, కోలో, మేడితోకో విరిగిపోయింది. ఇక ఎప్పుడు కొత్త నాగలి చేయించుకొని తెస్తావు? ఓ రైతన్నా! నీ కష్టాలు చూచేదెవరన్నా!

ఇలా కర్షక జీవితం కష్టమయం, దుఃఖమయం అయిందే; అయినా దీనినే నమ్ముకొని ఈ భూమి పుత్రులుగా రెడ్లు వెలిగారు.



శ్రీ మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డి కూడా '...సత్కృవుల్ హాలికులైన నేమి, గహనాంతర సీమల కందమూల కౌద్దాలికులైన నేమి నిజదార సుతోదర పోషణార్థమై...' అన్న సూక్తికి నిదర్శనంగా వ్యవసాయం చేశారు; పనిబాటల వాళ్లతో చేయించారు.

ఉగాది సందర్భంగా ఆముదం చేనులో లొట్ట కొట్టడం, భూమిలోని దుబ్బు గంటల గడ్డి, చిన్న చిన్న మొక్కలు, కంప మొక్కలు గుద్దలితో తొలగించడం, ఆ తర్వాత గుంటుక కొట్టడం, ఏరువాక (విత్తనం తతి) నాటికి అంతా సంసిద్ధం చేసుకొని, భూమి అదును పదును చూచి విత్తనాలు వేయడం, ఆ తర్వాత జొన్న చేనిలో కలుపు పోవడానికి దంతె లేదా చిన్న గుంటుక కొట్టడం, వర్షాకాలంలో వరినాట్లు వేయడం, దసరా వరకు జొన్నచేను కోసుకోవడం, వరి ధాన్యం కూడా చేను కోసి కుప్ప గొట్టి ఇంటికి చేర్చడం, మళ్లీ వేసంగి వరి వేయడం, ఈ సందర్భంలోనే కుసుమ మొదలైన నూనె ధాన్యాలు వేయడం, సజ్జ, జొన్న చేలలో భాగంగానే వేసిన కందిచేను పంట బాగా ఎదిగేట్టు చూచుకోవడం, అందులోనే భాగంగా వేసిన పెసర, బెబ్బరి (అలచంద), దోసకాయ మొదలైన పప్పు శాక ధాన్యాలను భద్రపరుచుకోవడం, నువ్వు చేను వేసుకోవడం, ఏడాది పొడుగునా వీలునుబట్టి మిరప పండించడం, కొద్దిపాటి చవిటి నేలల్లో తైదలు పండించడం, ఇంటి దగ్గర పొలం గట్ల మీద బావి దగ్గర పొలం కాడ ముఖ్యంగా బీర, దొండ, ఆనగం, పొట్ల, బీర్నీసు, టమాట మొదలైన కూరగాయలు బాగా పండించడం, బంతి, చేమంతి, గన్నేరు, మల్లె, మొల్ల, గుల్మాల (మంచి మల్లె) కట్ల, వావిలి, తంగెడు, రేల మొదలగు పూల చెట్లు పెంచడం, చింత, దానిమ్మ, నిమ్మ, దూది నిమ్మ, మామిడి, సీతాఫలాది వృక్షాలు పెంచి పండ్ల వల్ల పుష్టి కలిగే పద్ధతులు అనుసరించడం, అన్ని రకాల చేలకు నీళ్లు పారడానికి మోట, కాలువ, వాగు వరదను ఉపయోగించుకోవడం... ఇలా ఇలా ఎన్ని పనులని వ్యవసాయంలో. ఇటువంటి పనులన్నీ తాను చేస్తూ, చేయిస్తూ 'కష్టే ఫలి' అన్న సూత్రం ఆధారంగా జీవించారు శ్రీ మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డి.

మోటలు గొట్టే సందర్భంలో వారు మోట పాటలు కూడా విన్నారు. అందులో ఉన్న కొంత అసభ్య శృంగారానికి మనిషి మనస్తత్వమే కారణమనుకొన్నారు.

మోటాకంటూ నీవూ వోతే
మొత్తుకొంటారా ఎట్ల పందూ
మానెడు జొన్నాలా కూలివెట్టీ - సోరావాడా!
మాఉు మగణ్ణీ తోలిపోరా!

మరొకరిని మోటకు పంపించి నీవు ఇక్కడే ఉండిపో అనే అర్థం కూడా ఇందులో వస్తుంది. స్త్రీ పురుషుల మనస్తత్వాలకు సంబంధించి మోటలు గొట్టే మగవాళ్లే పాడుకోవడం జరుగుతుంది. శ్రీ వేణుగోపాలరెడ్డి ఇటువంటి జానపద గేయాలు ఎన్నో విన్నారు. ఎంతయినా ఇవన్నీ భాగవతం పద్యాల మీదికి రావని, అన్నిటికన్నా భాగవతమే గొప్పదని ఆయనలో ఒక అభిప్రాయం స్థిరపడింది.

ఏది యేమైనా వ్యావసాయిక జీవితానికి ఆధారమైన భూమి విషయంలో ఇతరులతో పొరపొచ్చాలు, విభేదాలు పొడసూపాయి. కొన్ని కేసులు కూడా నడిచాయి. కొంత భూమి వదలుకోవలసి వచ్చింది. శ్రీ రెడ్డి ఎదుగుతున్న దశలోనే ఇలా జరిగింది. మొకద్దమాల (కేసుల) పేర కోర్టుల చుట్టూ తిరగడం శ్రీ వేణుగోపాలరెడ్డికి అంతగా ఇష్టం లేదు. అయితే సమష్టి కుటుంబంలో అందరితోపాటే వారు నడిచారు. తాము జీవితంలో స్థిరపడ్డ తర్వాత భూమి సమస్యలు తొలగిపోయాయి. అయినా కృషి ఉంటే మనుషులు ఋషులవుతారు అన్న ధ్యేయ వాక్యాన్ని పాటించి జీవించారు శ్రీ వేణుగోపాలరెడ్డి.

## 6. వివాహం - కుటుంబ జీవితం

శ్రీ రెడ్డికి 22 సం॥ల వయస్సులో అంటే 1940వ సం॥లో శ్రీమతి అనంతమ్మ గారితో వివాహం జరిగింది. వారి కుటుంబ జీవితం మూడు పూవులారుకాయలుగా వికసించింది.

వెలిమినేడులో గ్రామ పరిపాలనకు సంబంధించిన ప్రభుత్వపర బాధ్యతలేవీ స్వీకరించలేదు. తన పని తాను చేసుకొంటూ, అప్పుడప్పుడు సామాజిక సేవా కార్యక్రమాలలో పాల్గొంటూ ముందుకు నడిచారు.



శ్రీమతి అనంతమ్మ, వేణుగోపాలరెడ్డి దంపతులకు ఆరుగురు కొడుకులు, ఒక కుమార్తె కలిగారు. శ్రీ రెడ్డి అందరినీ చదివించారు. వారి వారి శక్తి మేరకు వారందరు ఆయా వృత్తి విద్యా ఉద్యోగాల్లో స్థిరపడ్డారు.

1. పెద్ద కుమారుడు మంచిరెడ్డి వెంకట నారాయణ రెడ్డి లా పూర్తి చేసి, న్యాయవాద వృత్తిలో స్థిరపడ్డారు. ఆయన ధర్మపత్ని శ్రీమతి జయమ్మ. వీరి సంతానంలో చంద్రపాల్ రెడ్డి కొడుకు, గాయత్రి కూతురు. ఈ ఇరువురి మనుమడూ మనమరాలి వివాహాలు జరిగాయి. వీరు స్థిరపడ్డారు.

2. రెండవ కుమారుడు శ్రీ జలంధర్ రెడ్డి, ఉన్నత విద్యాభ్యాసం చేశారు. అధ్యాపకులుగా పనిచేశారు. ప్రధానోపాధ్యాయులైన తర్వాత పదవీ విరమణ చేశారు. వారి ధర్మపత్ని శ్రీమతి సుమిత్రమ్మ. శ్రీ రెడ్డి గారు కొన్నాళ్లు అమెరికాలో ఉన్నారు. అక్కడ వ్యాపారం చేశారు. వీరి అబ్బాయి సుజన్‌పాల్ రెడ్డి, అమ్మాయి సుమన్ పటేల్. ఈ మనుమడూ, మనమరాలు ఉన్నత విద్యావంతులు. సుజన ఎం.బి.బి.ఎస్. పూర్తిచేశాక ఇప్పుడు అమెరికాలో ఉంటున్నారు.

3. మూడవ కుమారుడు శ్రీ సుధాకర్ రెడ్డి. వీరు డిగ్రీ పూర్తి చేశాక, అమెరికాలో ఎంబిఎ చదివారు. ఇప్పుడు అమెరికాలో కుటుంబంతోపాటు ఉంటున్నారు. వారి శ్రీమతి కవిత. వీరి అమ్మాయి బృంద, అబ్బాయి సోహన్. అమెరికాలో వ్యాపారంలో స్థిరపడ్డారు వీరు.

4. నాల్గవ కుమారుడు శ్రీ రవీంద్ర రెడ్డి. వీరు కంప్యూటర్ ఇంజనీర్. అమెరికాలో ఉంటున్నారు. వారి ధర్మపత్ని డా॥ గీత. అక్కడే వైద్య సేవలందిస్తున్నారు. వీరి అమ్మాయి రీకా, అబ్బాయి రితిన్.

5. ఐదవ కుమారుడు శ్రీ రాంనాథరెడ్డి. హైదరాబాదులోనే రియల్ ఎస్టేట్ వ్యాపారంలో ఉన్నారు. వీరి ధర్మపత్ని శ్రీమతి సుజాతారెడ్డి. వీరి పెద్దబ్బాయి రాంబో, చిన్నబ్బాయి వేగా పటేల్.

6. ఆరవ కుమారుడు శ్రీ కరుణాకర్ రెడ్డి. కంట్రాక్టర్‌గా స్థిరపడ్డారు. వారి ధర్మపత్ని శ్రీమతి స్వర్ణలత. అబ్బాయి పృథ్వి, అమ్మాయి అలీషా.

7. ఇరువురి కుమారుల తర్వాత కలిగిన కూతురు శ్రీమతి సుగుణ. రుద్రవరం వారి ఇంటి కోడలు. భర్త శ్రీ యాదగిరి రెడ్డి గారు. పబ్లిక్ సర్వీస్ కమీషన్ ఆఫీసులో ఉద్యోగం చేశారు. 15 సం॥ల క్రితం స్వర్గస్తులైనారు. యాచారం దగ్గర ఉన్న చింతుల్ల వారి స్వగ్రామం. శ్రీమతి సుగుణ గారి అబ్బాయి రాజారాం కరణ్ రెడ్డి అమెరికాలో ఇంజనీర్. కూతురు ప్రసన్నలక్ష్మి అమెరికాలోనే ఉన్నారు. మరో కూతురు ప్రశాంతి.

ఇన్ని కుటుంబాలు కలుపుకొంటే ఒక్కొక్కటి ఒక స్వరం (సరిగమపదని) అనుకొంటే ఈ కుటుంబం సప్త స్వరాల వీణ. ఈ వీణలో అనేక మూర్ఛనలు. మనుమలూ మనమరాళ్లు. కొందరు అమెరికాలో కొందరు భారత్‌లో. ఈ మనుమలూ మనమరాళ్లకు ఎంత మందికి వీరి తాతగారి గురించి తెలుసో! అనిపిస్తుంది. కాని ఆ తాత శ్రీ మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డి మూడు పర్యాయాలు అమెరికా వెళ్ళారు. ఊర్ధ్వ త్రిపుండ్రధారి అయిన ఆ తాత గారి రూపం మనుమలూ - మనమరాళ్ళు అందరికీ తెలుసు. కాని వారు ధరించిన ఆ ఊర్ధ్వ పుండ్రాల వెనుక ఉన్న తత్త్వం తెలుసుకోవడం కష్టం. ఏదో దీక్ష తీసుకొన్నారనుకొంటారంతేగాని, మానవుని ప్రయాణం ఊర్ధ్వ ముఖంగా సాగాలని, అదే పరమ పథమని, ఇది జీయరు స్వాముల తత్త్వ సంకేతమని, శ్రీమద్రామానుజుల సంప్రదాయమని కొందరే తెలుసుకొంటారు. ఎవరెంత తెలుసుకొంటే అంత. కొందరు రూపం దగ్గరే ఆగిపోతారు; మరి కొందరు ఆత్మ తత్త్వం వరకు వెళ్లిపోతారు.

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాతనే ఈ సమష్టి కుటుంబం వేరయింది. పిల్లలందరినీ బాగా చదివించాలి. పంచుకోగా మిలిగిన ఆస్తి, అది గట్టి పరచుకోవాలి. వేరుపడ్డ సందర్భంలో 50 పుట్ల గల్లా (ధాన్యం) పోయింది. కష్ట సుఖాలు కావడి కుండలు. కొన్ని మనం నిలుపుకొన్నా ఉండవు. పోయే కాలం వస్తే పోతూనే ఉంటాయి. మనదయింది మాత్రమే మన దగ్గర ఉంటుంది. అయిదారు అరకలతో కొనసాగే వ్యవసాయం. జొన్నలు, వడ్లు, ఆముదాలు ముఖ్యమైన పంటలుగా కుటుంబం వికసించింది.



# 7. సామాజిక జీవితం

ఎవరు ఏ పనిచేసినా సమష్టి కుటుంబానికే కీర్తి ప్రతిష్ఠలు వస్తాయి. అన్నలు - తమ్ముళ్ళు అందరూ వేరై ఎవరి జీవితాలు వారివయ్యాయి. ఎవరి కుటుంబాలు వారివి. ఎవరి కష్టసుఖాలు వారివైనా పరస్పరం ఆదుకోవడం, ఆనందం పంచుకోవడం దాయాదుల్లో కూడా కనిపించే ఉత్తమ సంస్కారం. గెట్టు పంచాయితీలు, బావినీటి పంచాయితీలు, వారి చేను వీరి పశువు మేస్తే, వీరి చేను వారి పశువు మేస్తే కలిగే చిరు కలహాలు కొంత మనస్తాపాన్ని కలిగించేవే. రెడ్ల కుటుంబాలలో ఒక్కోసారి కొన్నాళ్లు కొన్నేళ్లు మాటలు కూడా ఉండవు. కాని, ఒకరింట పచ్చతోరణం కడితే, పెళ్లయితే, పండుగో, పబ్బమో జరిగితే, ముఖ్యంగా కర్మకాండల్లో అందరూ కలిసిపోతారు. ఈ సందర్భంగా ఆటలు - పాటలు - ముచ్చట్లు ఓ ప్రవాహ సదృశంగా ఉంటాయి.

శ్రీ వేణుగోపాలరెడ్డికి కూడా ఇటువంటి అనుభవాలున్నాయి. వ్యక్తిగతంగా వారి సామాజిక జీవితాన్ని గూర్చి అధ్యయనం చేసినప్పుడు కొన్ని విషయాలు బహిర్గతమయ్యాయి.

1. వెలిమినేడులో శ్రీ ఆంజనేయస్వామి గుడి ఉంది. ఆ గుడిలో శ్రీ రెడ్డి రెండు మూడు సప్తాహాలు చేయించారు. ఆ సందర్భంగా భజనలు, కీర్తనలు, యక్షగానాలు నడిపించారు. అందరికీ భోజన సంతర్పణ చేయించారు. గుడికి ప్రభ కట్టించి అలంకారం చేయించారు. ఈ విషయంలో వారెందరికో మార్గదర్శకులు అయ్యారు.

2. గుడిలో అన్నదానం, వస్త్రదానం అప్పుడప్పుడు నిర్వహించారు. భజనలు చేయించారు; భజనల్లో పాల్గొన్నారు. కార్తీక మాసంలో ఇంటింటా జరిగే భజనలు వికసించడానికి తోడ్పడ్డారు.

3. గణేశ ఉత్సవాలు, శ్రీరామనవమి ఉత్సవాలు, హనుమజ్జయంతి మొదలైన కార్యక్రమాలు విజయవంతం కావడానికి తమ వంతు యోగదానం అందించారు.

4. మనిషికి నిత్య నైమిత్తిక జీవితం ఉంటుంది. నిత్యం చేసే పని, తమ తమ కడుపుల కొరకు చేసేది. కోటి విద్యలు కూటి కొరకే. అయితే ఉన్నదాంట్లోనే పదిమంది పంచుకోవడంలోనే ఆనందముంటుంది.

ఊళ్లో పాఠశాల లేదు. ఊళ్లో రెడ్లు - పటేళ్లు ఓ పంతులు గారిని ఏర్పాటు చేసుకొని పిల్లలకు చదువులు చెప్పిస్తున్నారు. ఓనమాలు చదివేవారు ఒక రూపాయి, బాలశిక్ష చదివేవారు రెండు రూపాయలు ఇచ్చేవారు. శ్రీ రెడ్డి గారి సమిష్టి కుటుంబం ఇంట్లో బంకులు (వసారాలు) పెద్దవే. చాలా సం॥లు ఆ బంకుల్లోనే ఎందరో పిల్లలు చదువుకొన్నారు. అదొక పాఠశాలగా మారింది. దగ్గరే ఉన్న లాసులూరులో స్కూలుండేది. ఆ స్కూలును పర్యవేక్షించి (తనిఖీ చేసి) వెళ్లే నాజరు సాబు (ఇ.ఓ.) వెలిమినేడులో స్కూలు లేదని తెలుసుకొన్నాడు. ఆయనకు చెప్పిన వ్యక్తి 'మా ఊరిలో స్కూలు లేదు, ఉన్న పంతులు మా పటేలు ఇంట్లోనే చదువు సెప్తాడు' అని చెప్పాడట.

ఆ తర్వాత స్కూళ్ల పర్యవేక్షకులు శ్రీ రెడ్డి గారి ఇంటికి వచ్చారు. అతనికి మర్యాదలు చేశారు. ఊరిలో ఎప్పుడో జాగీరుబడి పెట్టారు కానీ, నాల్గు రూపాయల వేతనానికి ఎవరూ ఇక్కడికి రావడం లేదని శ్రీ వేణుగోపాలరెడ్డి ఆయనతో అన్నారు. అతను పాఠశాల కొరకు అప్లికేషన్ ఇవ్వాలి అన్నాడు. శ్రీ రెడ్డి మరికొందరు సంతకాలు చేసి దరఖాస్తు ఇచ్చి పైకి పంపించారు. ఆరునెలల్లో ఊరికి స్కూలు మంజూరయింది. నిర్మల రాములనే టీచర్ మొదటిసారిగా వచ్చారు. అతనికి వసతి, సౌకర్యాలు శ్రీ రెడ్డి కుటుంబమే కల్పించింది. ఊరిలో జాగీరు గారి దేవుడి ఉన్నది. దానిని సరి చేయించి స్కూలుగా మార్పించారు. శ్రీ వేణుగోపాల్ రెడ్డి గారి తొలి ఆ కృషి వల్ల ఆ స్కూలు దినదినాభివృద్ధి చెంది, ఎంతో మంది బీదలకు ఆధారమై నిలిచింది. డబ్బులిచ్చి సొంత పంతులును పెట్టుకొనే శక్తి లేని వారికెందరికో విద్యా దానం చేసే వ్యవస్థ నెలకొల్పిన కీర్తి ఆ విధంగా రెడ్డి గారికీ, వారి కుటుంబీకులకే దక్కింది.



## 8. రాజకీయాలు - స్వాతంత్ర్యోద్యమం

గాంధీ గారి అహింసాయుతమైన స్వాతంత్ర్య పోరాటం శ్రీ వేణు గోపాలరెడ్డి గారికి నచ్చింది. ఆర్య సమాజ్, స్టేట్ కాంగ్రెస్ నిర్వహిస్తున్న నిజాం వ్యతిరేక ఉద్యమంలో వీరు పాల్గొనకున్నా, అందులో పాల్గొనాలనే ఉబలాటం ఉండేది. సర్దార్ జమలాపురం కేశవరావుగారి ఉపన్యాసాలు విని ప్రభావితులయ్యారు. శక్తి ఉత్సాహాలున్నవారు ఆయన మార్గంలో నడవాలని చెప్పేవారు.

దేశంలో బ్రిటీష్‌వారిని ఎదిరించిన సర్దార్లు ఇద్దరే ఉన్నారు. ఒకరు సర్దార్ వల్లభభాయి పటేల్, మరొకరు సర్దార్ జమలాపురం కేశవరావు అని శ్రీ రెడ్డి పది మందితో అంటుండేవారు.

ప్రజాస్వామ్య వ్యవస్థలో ఎన్నికల తంతు ప్రారంభమైన తర్వాత అంటే 1950 తర్వాత శ్రీ మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డి కాంగ్రెస్ పార్టీ వైపు పనిచేశారు. నిష్కల్మషంగా మనసు పెట్టి పనిచేశారు. అయితే రాజకీయాలకు సంబంధించినంతవరకు క్రియాశీల కార్యకర్తగా గాక వాటిలో అంటీ ముట్టనట్లుగానే ఉన్నారు.

## 9. ఆధ్యాత్మిక రంగం

ఈ ఉపాధితో (శరీరంతో) సంసారంలో ఎవరమైనా ఉండకతప్పదు. ఆయన పిలుచుకొన్ననాడు ఎవరమైనా వెళ్లక తప్పదు.

'..బ్రతికినన్నాళ్లు నీ భజన చేతును గాని
మరణ కాలము నందు మఱతునేమొ...'

అన్నాడు ధర్మపురి శతకకర్త. బ్రతికినన్నాళ్లు చేయక, అంత్యకాలములోనే నీ భజన చేస్తే సరిపోతుంది, లేదా అవసరాన్ని బట్టి కొడుకును నారాయణా అంటూ పిలిచిన అజామిళుని లాగా వ్యవహరిస్తే చాలు అనుకొనేవారి గురించి ఏం చెబుతాం. మన ఇంద్రియాలు మన వశం తప్పిపోయినపుడు మొదటి నుండి భగవన్నామ స్మరణం చేయనివారు ఆ చివరలో ఆ శ్రీహరిని స్మరించగలరా?

అందుకే చిన్నప్పటి నుండి తనపై ముద్ర వేసిన శ్రీమద్భాగవతాన్నే నమ్ముకొన్నారు శ్రీ మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డి. నిరంతర భాగవత పారాయణం చేయడమే కాక ఆధ్యాత్మిక గోష్ఠులలో పాల్గొన్నారు.

1972లో శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామి ఆధ్యాత్మికోపన్యాసాలు హైదరాబాదులోని ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో జరిగాయి. అప్పటికే శ్రీమన్నారాయణ కవచం తాను పారాయణం చేస్తున్న సంగతి శ్రీ రెడ్డి, శ్రీ స్వామి వారికి నివేదించుకొన్నారు. అంతే ఆ స్వామి వారు మహదానందం పొందారు. దగ్గరికి రమ్మన్నారు. మీకు మేము దీక్ష ఇస్తున్నామన్నారు.

ఆ మరుసటి రోజే ఏర్పాట్లు పూర్తయ్యాయి. శ్రీ వేణుగోపాలరెడ్డి గారితో పాటు మరి కొందరు శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామి వారిని సమాశ్రయించారు. భుజాల మీద శంఖ చక్రాల ముద్రాధారణం జరిగింది. మంత్రోపదేశం చేశారు. తర్వాత గాయత్రిని ఉపదేశించారు. అప్పటి నుండి ఊర్ధ్వ పుండ్రధారణం మొదలయ్యింది.

అదివరకే శ్రీ రెడ్డికి ఓ భట్రాజు సుదర్శన నారసింహ మంత్రోపదేశం చేశారు. శ్రీశ్రీశ్రీ పెద జీయరు స్వాముల వారు అష్టాక్షరీ మంత్రోపదేశం చేశారు.

**కాం కర్తే రహో**
**నాం జప్తే రహో**

**(పని చేస్తూ ఉండు**
**పరమాత్మను స్మరిస్తూ ఉండు)**

ఇది ధ్యేయంగా మారి పోయింది. నియమ నిష్ఠా గరిష్ఠమయిన జీవనం మొదలయ్యింది. అయితే సాత్త్వికాహార నియమ నిష్ఠ తప్పిపోతున్నదని శ్రీ రెడ్డి అప్పుడప్పుడు చింతిస్తూ ఉండేవారు.

ఒక నలబై ఏళ్ళ క్రితం తెలంగాణాలోని అనేక గ్రామాలకు, ఆయా కులాలకు చెందిన గురువులు వస్తుండేవారు. ఆ గురువులు కూడా సాత్త్వికాహార నియమాన్ని



దాటి వ్యవహరించడం ఎందరమో చూశాం. అయితే గురు పీఠమే తప్పు చేసింది మేం చేస్తే ఏమిటి అని సమర్థించుకోవడానికి ఇది చెప్పలేదు. రాజస తామసాహారాలు మనిషిని అశాంతిలోకి నెట్టివేస్తాయి. అయితే ధ్యాన మనో నిగ్రహాల ద్వారా దీనినీ జయించినవారు అక్కడక్కడ కనిపిస్తారు.

శ్రీ రెడ్డి నియమ నిష్ఠలతో, నామ జపాలతో అతి సాదా సీదాగా జీవితం గడిపారు. ఈ పయనం ఈ సహస్ర మాస పూర్ణ చంద్ర దర్శనం వరకు నిరాటంకంగానే కొనసాగుతున్నది. ఇలా పూర్ణాయుష్షు వరకు కొనసాగాలనే మనమూ ఆశిద్దాం.

## 10. అనారోగ్య సంచలనం

అయితే శ్రీ మంచిరెడ్డి వేణుగోపాల రెడ్డి తన 45వ ఏటనే అంటే 1964వ సం॥లో తీవ్ర అస్వస్థతకు గురయ్యారు. రక్త క్షీణత కారణంగా ఎన్ని మందులకూ జబ్బు నయం కాని పరిస్థితులు దాపురించాయి. ఎన్ని ఆస్పత్రులు తిరిగినా తక్కువ కావడం లేదు.

అతిసారం, విరేచనాలు, బలహీనత, ఏం మాయదారి జబ్బో ఎవరికీ అర్థం కావడం లేదు. ఓ రోజు బావి దగ్గర స్పృహ తప్పి పడిపోయారు. 24 గంటల వరకు స్పృహ రాలేదు. హైదరాబాదులోని కోఠి హాస్పిటల్‌లో చేర్పించారు. అక్కడ ఎన్ని రోజులున్నా ఏ మందూ పనిచేయడం లేదు. ఇక ఈయన బ్రతకడనే అందరూ నిర్ధారించారు. డాక్టర్లు కూడా పెదవి విరిచారు.

ఓ రోజు ఉదయం ఆస్పత్రి ఆరుబయట ఎండ పొడకు నెత్తికి చేతులు పెట్టుకొని శ్రీ రెడ్డి కూచొని ఉన్నారు. ఈ శరీరం పని అయిపోయింది. ఆయన పిలుపు వచ్చింది. ఇక వెళ్లవలసిందే అని నిర్ణయించుకొన్నాడు.

పీక్కుపోయిన కళ్ళు, పాలిపోయిన ముఖం, ఎముకలు తేలిన శరీరం, గాజుల్లాగా మారిన కళ్లు, పైగా అంతకు క్రితం ఒకటి రెండు రోజుల ముందు

ఏకాదశీ వ్రతం చేశారు. ఉపవాసం, రక్త క్షీణత, బలహీనత, అతిసారం, శరీరంలో ఏ మాత్రం జవసత్వాలు లేని స్థితి.

ఈ స్థితిలో ఉండే శ్రీ రెడ్డిని కొన్నాళ్లుగా ఆ ఆస్పత్రిలోని ఓ ముసలి కాంపౌండర్ చూస్తూనే ఉన్నాడు. ఆయన ఎన్నో ఏళ్లుగా ఆ ఆస్పత్రిలోనే పనిచేస్తున్నాడట. మెల్లగా వచ్చి శ్రీ వేణుగోపాలరెడ్డి దగ్గర కూచున్నాడు.

'క్యాహువా - కైసా హై' (ఏమయింది? ఎలా ఉన్నారు?) అని అడిగాడు.

'జీనేకా భరోసా నహీఁ' (ఇక బ్రతుకుతానన్న నమ్మకం లేదు) అన్నారు శ్రీ రెడ్డి.

ఇలాగే వారిద్దరి మధ్యన ఓ వేదాంత ధోరణిలో సంభాషణ జరిగింది. ఆ సంభాషణ సారాంశమిది.

'నేను చనిపోతానని ఎందుకు భయపడాలి? నిరాశ ఎందుకు? పుట్టింది సత్యం. చచ్చేది సత్యం. ఈ రెండే తప్పక జరిగేవి. ఎవరాపినా ఆగకుండా జరిగే ఈ రెండింటి గురించి విచారమెందుకు? భయమెందుకు?

మన పని మనం చేస్తూ పోవాలి. ఆ దేవుడు ఆయన పని ఆయన చేస్తాడు. కాలం తీరిన తర్వాత పిలుచుకొంటాడు. ఆయన కిష్టమైన వారినే పిలుచు కొంటున్నాడనుకొంటే ఏ చింతా - వంతా ఉండదు.

ఇవాళ ఇంట్లో రేపు మంట్లో! వచ్చిన్నాడు తెచ్చింది లేదు. పోయిన్నాడు కట్టగట్టుకొని పోయేది లేదు.

మనది ఏదీ కానప్పుడు, మన వెంటక ఏదీ రానప్పుడు ఇక దుఃఖమెందుకు?

సరే! అయినా ఆ దేవుడేం చేస్తాడో చూద్దాం. ఆయన నిన్ను కాపాడు కోవాలనుకొంటే కాపాడుకొంటాడు.'

ఆ వృద్ధ కాంపౌండర్ అలా చెబుతుంటే కళ్లప్పగించి చూస్తూ, చెవులప్పగించి విన్నాడు శ్రీ మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డి.



'నేను ఆ నారాయణ మూర్తినే నమ్ముకొన్నాను. ఆయన తన చేతులు వదిలేశాడు అన్నారు' శ్రీ రెడ్డి.

'ఆయనెందుకు చేతులు వదిలేస్తాడయ్యా! ఈ మందు వేసుకో! నీకు నయమవుతుంది! చేతులు చాపండి!... నోట్లో వేసుకోండి! నీకు తప్పక నయమవుతుంది... నమ్మండి! నమ్మండి.'

ఆ ముసలి కాంపౌండర్ వెళ్లిపోయాడు. ఆయన చెప్పినట్లు ఆ మందు వాడాడు శ్రీ మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డి.

ఆశ్చర్యం - అద్భుతం - నిజం - మిరాకిల్

ఈ మరుసటి రోజు నుండే కొద్ది కొద్దిగా మార్పు కనిపించింది. అలా అలా మూడు నెలల్లో ఆరోగ్యం కుదురుకొంది; చక్కగా కుదురుకొంది.

'ఏను మృతుండనౌదునని ఇంత భయంబు మనంబులోపలన్ పూనిన' శ్రీ మంచి రెడ్డి వేణుగోపాలరెడ్డి 'కలయో వైష్ణవ మాయయో' అనుకొంటూ ఆ లక్ష్మీనారాయణ మూర్తికి శతకోటి దండాలు పెట్టుకొన్నారు.

## 11. గాయం కథ నుండి అమృతోత్సవ పూర్ణిమ వరకు

శ్రీ మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డికి కలిగిన ఒక గాయంతో ఈ జీవిత కథను ప్రారంభించుకొన్నాం. అది 1947వ సంవత్సరం. భారతదేశానికి స్వాతంత్ర్యం వస్తుందను కొంటున్న రోజులు. తెలంగాణా మహారాష్ట్రలోని కొన్ని జిల్లాలు, కర్ణాటకలోని కొన్ని జిల్లాలు కలిపి హైదరాబాద్ సంస్థానం. ఇదే నిజం రాష్ట్రం.

(తెలంగాణా : ఇవి ఎనిమిది జిల్లాలు : 1. వరంగల్లు, 2. కరీంనగర్, 3. ఆదిలబాద్, 4. నిజామాబాద్, 5. మహబూబ్‌నగర్, 6. మెదక్, 7. హైదరాబాద్ అత్రాపుబల్దా (నగరంతో పాటు చుట్టు ప్రక్కల్లోని గ్రామాలు) 8. నల్లగొండ (ఖమ్మం తర్వాత ఏర్పడింది.)

(ఇక రెండో భాగం మరఠ్వాడా : మహారాష్ట్ర ప్రజలెక్కువగా ఉండే ప్రాంతమిది. ఇందులో అయిదు జిల్లాలు. 1. ఔరంగాబాదు, 2. బీడు, 3. పర్భణి, 4. నాందేడు, 5. ఉస్మానాబాదు)

(మూడో భాగం : ఈ రెండింటికన్నా చిన్నది. ఇది కర్ణాటక ప్రాంతం. కన్నడం మాట్లాడేవారు ఎక్కువగా ఉండేది. ఇవి మూడు జిల్లాలు. 1. గుల్బర్గా, 2. రాయచూరు, 3. బీదరు)

ఈ మొత్తం సంస్థానం విస్తీర్ణం 82.698 చ. మైళ్ళు. ఇందులో నిజం సొంత జాగీరు (సర్ఫెఖాస్) 8100 చ. మైళ్ళు. రాజ బంధువులు (పాయెగాలు) 3262 చ. మైళ్ళు. వ్యక్తుల జాగీర్లు రాజుల సంస్థానాలు 11,000 చ.మైళ్ళు. ఇలా 22.362 చ.మైళ్ళు పోగా మిగిలిన 60.336 చ.మై. అంటే 59.21 శాతం భూమి నిజాం దివానీ లేక ఖాల్సా ప్రాంతం అని పిలువబడేది. నిజాంల పాలన నేరుగా దీని మీదుండేది. సొంత జాగీరు మీద వచ్చే సమస్త ఆదాయం నిజాం సొంతానికి.

జాగీర్దార్లు చిన్న చిన్న రాజులుగా వ్యవహరించేవారు. ఆ విధంగా వెలిమినేడులో కూడా ఓ జాగీర్దారు. అతని భవనం పేరు జాగీరు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో అతను వెలిమినేడులో ఉండని పరిస్థితులు ఏర్పడడంతో వెళ్లిపోయారు. ఆ జాగీరు భవనమే పాఠశాలగా మారిందని, అలా మారడంలో శ్రీ మంచిరెడ్డి శ్రీ వేణుగోపాలరెడ్డి కృషి ఉందని చెప్పుకొన్నాం.

నిజాంకు గాని, జాగిర్దార్లకు గాని, చిన్న చిన్న సంస్థానాధిపతులు కొందరికి హైదరాబాదు సంస్థానానికి స్వాతంత్ర్యం రావడం ఇష్టం లేదు. అందువల్ల నిజాం పోలీసులు పగటిపూట, రజాకర్లు రాత్రి అత్యాచారాలు హింసా దౌర్జన్యాలు హిందువుల మీద కొనసాగించారు.

ఏడో నిజాంను ప్రజలలో అవతార పురుషునిగా చిత్రీకరించడానికి దీన్‌దార్ మతోన్మాద ఉద్యమం ప్రారంభమైంది. సిద్దీక్ అనేవాడిది ప్రారంభించాడు. సిద్దీక్ తనను ధర్మ గురువుగా, నిజాంను ధర్మరాజు అవతారంగా చిత్రీకరించి ప్రచారం చేశాడు. ధర్మరాజే ముస్లింగా పుట్టినందువల్ల హిందువులందరు ముస్లింలు కావల్సిందేనని అతని ప్రచార నేపథ్యం.



అలా ప్రజలు చేరకుండా గ్రామాల్లోని కొందరు హిందువులు చెబుతున్నారని స్థానికంగా ఉన్న ముస్లింలు కొందరు నిజాం పోలీసులకు, రజాకర్లకు ఉప్పందిస్తారు. గుళ్లను నిర్మించి, ఉత్సవాలు చేయించేవారిని అంతం చేయాలని ప్రణాళికలు వేశారు. అంతేకాక స్టేట్ కాంగ్రెస్, ఆర్య సమాజ్, హిందూ సేవా సంఘ్ రాజకీయాల్లో పాల్గొనేవారి వివరాలను రజాకర్లకు, నిజాం పోలీసులకు తెలిపేవారు.

వెలిమినేడులో అదే జరిగింది. ఆ రోజు రాత్రి 7 గం॥ల ప్రాంతంలో ముఖాలకు జాలీ ముసుగులు (జాలీలు) ధరించి శ్రీ వేణు గోపాల్‌రెడ్డి అన్న శ్రీ రాంచంద్రారెడ్డిని అంతం చేయాలని ఇంట్లో ప్రవేశించారు. శ్రీ రాంచంద్రారెడ్డి ఇంట్లో లేరు. వారు పని మీద వేరే గ్రామానికి వెళ్లారు.

ఇంట్లోకి రజాకర్లు వచ్చారనో - దొంగలు వచ్చారనో వదినగారు అరిచారు. మాటి మాటికి బ్యాట్రీలైట్లు వేస్తుంటే రక్షణ నిమిత్తం మిలిటరీ (ఇండియన్ మిలిటరీ) వచ్చిందేమో అనుకొన్నారు కొందరు. కాని వచ్చింది నరహంతక రజాకర్లే.

వారు రాంచంద్రారెడ్డి గురించి అడిగారు. లేదని తెలుసుకొన్నారు. వారు ఇల్లంతా వెదకుతూ ఎదురుపడ్డ వేణుగోపాలరెడ్డిని తుపాకి మడమతో గుద్దారు. ఆ తర్వాతనే జంబ్యా (కత్తి)తో నెత్తిన పొడిచారు. రక్తం ప్రవాహమైంది. శ్రీమన్నారాయణ కవచం చదువుకొంటూ శ్రీ వేణుగోపాల్‌రెడ్డి పడిపోయారు.

మహిళల మెడలలోని పుస్తెలతో పాటు ఇల్లంతా దోచుకొన్నారు రజాకర్లు. మొత్తం వీరు ఎనిమిది మంది ఉన్నారు. ఆయుధాలతో స్వైర విహారం చేశారు. ఈ వార్త మాదాపూర్‌కు అందింది. వెలిమినేడులో ప్రజలు భయపడి తలుపులు మూసుకొన్నారు. మాదాపూర్ నుండి ప్రజలు పరుగెత్తుకొని వస్తున్నారని ఎవరో అరిచారు. అంతే ఆ చీకట్లో రజాకర్లు తప్పించుకొని పారిపోయారు.

శ్రీ మంచిరెడ్డి వేణుగోపాల్‌రెడ్డి తమ్ముడు శ్రీ భూపాల్ రెడ్డి (వీరు మంచిరెడ్డి కిషన్ రెడ్డి గారి పితృపాదులు) తదితరులు అప్పుడే వచ్చారు. ఇటువంటి దౌర్జన్యాలు జరగవచ్చునని ఊహించే మంచిరెడ్డి వారి కుటుంబం కొన్ని తుపాకులు సమకూర్చుకొన్నది. ఆ తుపాకులందుకొని భూపాల్‌రెడ్డి తదితరులు మేడ మీదికి వెళ్ళి కాల్పులు జరిపారు. కాని అప్పటికే రజాకర్లు పారిపోయారు.

వెలిమినేడులోనూ, ఆ చుట్టు ప్రక్కల కొన్ని అరబ్బు కుటుంబాలుండేవి. వారి సహకారంతోనే రజాకర్లు ఈ దాడి నిర్వహించారు. స్వాతంత్ర్యోద్యమం - మిలిటరీ చర్య, నిజాం 1948 సెప్టెంబర్ 17వ తేదీన తలవంచడంతో వీరందరూ పారిపోయారు. నిజాం ఏలుబడిలోని తెలంగాణా మరఠ్వాడా కర్ణాటక ప్రాంతాలకు ఒక సంవత్సరం లేటుగా స్వాతంత్ర్యం వచ్చింది.

వైద్య సేవల వల్ల కోలుకొన్న శ్రీ మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డి, ఆ తర్వాత వ్యవసాయం, గ్రామసేవ, భాగవత పారాయణం, గృహస్థ జీవితం, కాంగ్రెస్ పార్టీ పనులు - ఇలా ఎన్నో కార్యక్రమాల్లో పాల్గొంటూ తమ వ్యక్తిత్వాన్ని నిలుపుకొంటూ అతి సాధారణంగా జీవనం గడిపారు. అయితే ఒక సాధారణ వ్యక్తిలోని అసాధారణత్వాన్ని గుర్తించడానికే ఈ కథనం.

కష్ట సుఖాల్లో సహభాగస్వామియైన వారి ధర్మపత్ని శ్రీమతి అనంతమ్మ గారు నిలదొక్కుకోవడానికి ఇచ్చిన ధైర్యం అపూర్వమైంది. వారి సంతానమూ దినదిన ప్రవర్ధమానమై అందరూ స్థిరపడి తమ తల్లిదండ్రులను అపూర్వంగా చూచుకొంటున్నారు.

ఇది వీరి వేయి పున్నమల కథ. సహస్ర పూర్ణ చంద్ర దర్శన సందర్భంగా నిర్వహించుకొంటున్న అమృతోత్సవ పూర్ణిమ. ఈ పున్నమ వెలుగులు పది మందికి మార్గదర్శనం చేస్తాయి. జీవిత గమనంలో విజయ ఫలాలనందిస్తాయి.

**ఇక అంతిమయాత్ర చదవండి !**



## 12. అంతిమ యాత్ర

అవును! ఇక అమృతోత్సవం; అంటే సహస్రపూర్ణ చంద్ర దర్శనోత్సవం జరగాలి.

ఆనందం.

పరమానందం.

కాళ్ళూ చేతులు సరిగా ఆడుతుండగా, ఎవరిచేత చేయించుకోకుండా, వేయి పున్నమలు చూచింది ఎంత మంది!

అందరికీ ఆనందం.

హైదరాబాదులోని వారే కాదు. అమెరికాలో ఉన్న కొడుకులు కోడండ్రు, మనుమలు మనుమరాండ్రు, అందరికీ మహదానందం.

వీలుండి సెలవులు దొరికిన అందరూ అమెరికా నుండి వస్తామన్నారు. తమ తల్లిదండ్రులు శ్రీ మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డి శ్రీమతి అనంతమ్మ అమెరికాకు రెండు, మూడు పర్యాయాలు వచ్చినప్పుడు కూడా, తాము ఆయా పనుల్లో ఉండగా పిల్లల యోగక్షేమాలు వారే చూచుకొన్నారు. వీకెండుల్లో తప్ప ఉద్యోగబాధ్యతల్లో తాము సతమతమవుతున్నప్పుడు, ఇంటిపట్టున తమ పిల్లల్ని చూచుకొన్నదెవరు? అటువంటి తల్లిదండ్రుల సహస్రపూర్ణ చంద్ర దర్శనోత్సవానికి వెళ్ళాల్సిందే! కొందరు తీర్మానించారు; కొందరు సెలవుల కొరకు ప్రయత్నాలు ప్రారంభించారు.

ఎలిమినేడు హైదరాబాదుకు సమీపంలోనే ఉంది. వ్యవసాయదారులెందరో తమ తమ పిల్లల్ని ఉత్తమ - ఉన్నత విద్యలవైపు నడిపించినట్లే, శ్రీ వేణుగోపాలరెడ్డి తన ఆర్గురు కొడుకులను బాగా చదివించాడు. వ్యవసాయం రాబడి తగ్గినా - పంటలు దెబ్బతిన్నా తన సంతానం చదువులు దెబ్బతిననివ్వలేదు.

అందుకే కొడుకులందరు స్థిరపడ్డారు. అమెరికాలో ఉన్న వారైతే తమ అమ్మానాన్నలకు ఏ కొదవలేకుండా జరిగిపోవాలని ఆశించారు. హైదరాబాదులో ఉన్నవారు కూడా ఆ దృష్టితోనే ఉన్నారు.

తన కొడుకుల, కూతుళ్ల గృహాలు, ఫ్లాట్సు అన్ని వాస్తుపద్ధతిలో ఉండాలని ఆశించారు శ్రీ రెడ్డి. ఒకవైపు అమృతోత్సవ సన్నాహాలు జరుగుతుండగా కూడా వారు ఈ ఆలోచనలు చేసి, అవి అమలయ్యేట్టు చూశారు.

అమృతోత్సవం తేది కొన్ని నెలల ముందే నిర్ణయింపబడింది. 2003 జనవరి 5వ తేది ఆదివారం. పత్రికలు అచ్చయ్యాయి. హైదరాబాదులో చాలామందికి పంచబడ్డాయి. ఆ రోజు సాయంకాలం 7 గం॥లకు వినయనగర్ కమ్యూనిటీ హాలులో బ్రహ్మాండంగా కార్యక్రమం నిర్వహింపబడాల్సి ఉంది. ఏర్పాట్లన్నీ జరిగిపోతున్నాయి.

మనమొకటి అనుకొంటాం. భగవంతుడొకటి తలుస్తాడు.

## విజయ వినాయక దేవాలయం - అనుబంధం :

వినయనగర్ కాలనీలో విజయ గణపతి దేవాలయం ఏర్పడినప్పటి నుండి శ్రీ మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డికి దానితో అనుబంధం ఏర్పడింది. ఆ ఆలయం పూజా పునస్కారాల్లో పాల్గొనేవారు. ఆలయం కార్యకర్తల్లో ఒకరైన శ్రీ వట్టికోట సంపత్కుమారాచార్యతో పరిచయం ప్రగాఢంగా ఏర్పడింది.

ఊర్ధ్వత్రిపుండ్రధారియైన శ్రీ రెడ్డి ఆలయానికి వస్తోంటే ఆచార్యుల వారికి ఆహా శ్రీమద్రామానుజుల వారు వస్తున్నారా అనిపించేది. ఈ శుద్ధ శ్రీ వైష్ణవమూర్తి ఎక్కడివారో! ఈ కాలనీకి వచ్చారు! మా గణపతి ఆలయం పవిత్రం చేయడానికి వస్తున్నారని అనుకొనేవారు.

శ్రీ రెడ్డిని పరిచయం చేసుకోవాలని శ్రీ రామానుజ దాసోऽహం అన్నారు. అంటే నేను రామానుజులవారికి దాసుణ్ణి అని అర్థం. 'సర్వాపరాధిని' అన్నారు. తప్పులు చేసినవాణ్ణి తమరే కాపాడాలని కూడా అర్థం.

'నేను వైష్ణవ బ్రాహ్మణున్ని కాను రెడ్డిని' అన్నారు శ్రీ వేణుగోపాలరెడ్డి.

ఆచార్యులవారు నమ్మలేనట్టుగా చూశారు. వైష్ణవం మూర్తీభవించి ఆ ముఖం మీద కనిపిస్తుంటే ఎలా నమ్మేది! 'శ్రీమద్రామానుజులు ఎవరిలో భేదం చూడకుండా



వైష్ణవంలోకి తీసుకొన్నారు కదా' అన్నారు శ్రీ రెడ్డి. 'అవును భక్తి ఉంటే చాలు' అన్నారు శ్రీ సంపత్కుమారాచార్యులు.

అలా వారి మనస్సులు కలిశాయి. సహస్రమాస పూర్ణ చంద్ర దర్శనోత్సవ ఆహ్వానపత్రిక మీది ఈ క్రింది మహాభాగవతంలోని పద్యం (ద్వితీయ స్కంధంలోని 17వ పద్యం) శ్రీ ఆచార్యుల వారు సూచించిందే!

'హరిమయము విశ్వమంతయు
హరి విశ్వమయుండు సంశయము పనిలేదు, ఆ
హరిమయము గాని ద్రవ్యము
పరమాణువు లేదు వంశ పావన వింటే!'

ఈ విశ్వమంతా విష్ణుమయమే. ఆ విష్ణు విశ్వమంతా ఉన్నాడు. అనుమానం అక్కరలేదు. విష్ణుమయం కాని పదార్థం లేనే లేదు. పరమాణువులో కూడా హరే ఉన్నాడు. అండాండ పిండాండ బ్రహ్మాండాల అంతటా ఆ విష్ణువే ఉన్నాడని అర్థం. విష్ణు సహస్రనామాలలో భగవంతుని మొదటి పేరు విశ్వం.

ఆ విశ్వవ్యాపియైన విష్ణు కథలే వినడానికి ఇష్టపడేవారు శ్రీ వేణుగోపాలరెడ్డి. గణపతి దేవాలయంలో శ్రీ పప్పు నాగేశ్వరరావు భాగవత పురాణం చెబుతున్నప్పుడు ప్రతిరోజూ వచ్చేవారు. భాగవత పురాణం, అందులో పోతన్న పద్యాలంటే వారికెనలేని ఇష్టం.

## శ్రీ బద్దం ప్రతాపరెడ్డితో అనుబంధం :

విజయగణపతి దేవాలయం కమిటి కార్యకర్తల్లో వినయనగర్ కాలనీకి చెందిన శ్రీ బద్దం ప్రతాపరెడ్డి ఒకరు. వీరూ పద్యప్రియులు. విశ్వనాథ వారి రామాయణమన్నా, పోతన్న భాగవతమన్నా వీరూ పడిచస్తారు.

ఇంకేం వేణుగోపాలరెడ్డి గారు చెప్పేవి వినే సహృదయ మిత్రులు దొరికారు. శ్రీ బద్దం, వారి వయస్సును గౌరవిస్తూ, వారి భాగవత ప్రీతికి పరవశిస్తూ పోతన్న శివ కేశవులను సమానంగా భావించడమేకాక, ఆ దేవుళ్ళు ఇద్దరూ ఒక్కరే అనేవారు.

అవును కాని నాకు 'హారికి నంద గోకుల విహారికి...' అన్న పద్యమే ఇష్టం అని వేణుగోపాలరెడ్డి అనేవారు.

ఒక పద్యం విషయంలో ఇరువురూ చర్చించుకొన్నారు. ఆ పద్యం భాగవతంలోనిదే అని శ్రీ ప్రతాపరెడ్డి అంటే, అది అందులో లేదని భాగవతమే తెచ్చి చూపించారు శ్రీ వేణుగోపాలరెడ్డి. నిజానికి పూర్వ భాగవతాల్లో ఆ పద్యం లేదు. కొత్తవాటిలో ఉంది. ప్రాతప్రతి శ్రీ వేణుగారిదైతే, కొత్త ప్రతి శ్రీ ప్రతాపరెడ్డి గారిది. ఇంతకూ వివాదానికి కారణమైన ఆ పద్యం ఇది.

**'అంబ! నవాంబు జోజ్జ్వల కరాంబుజ! శారద చంద్ర చంద్రికా**
**డంబర చారుమూర్తి! ప్రకటస్ఫుట భూషణ రత్నదీపికా**
**చుంబిత దిగ్విభాగ ! శ్రుతి సూక్తి వివిక్త నిజ ప్రభావ! భా**
**వాంబర వీధి విశ్రుత విహారి! ననుం గృపజూడు భారతీ!'**

ఇది సరస్వతీ దేవి ప్రార్థన. 'శారద నీరదేందు ఘనసార పటీర మరాళ మల్లికాహార!....' అనే పద్యం ఈ పై పద్యం నూతన భాగవత ప్రతుల్లో ఉన్నాయి. పై అంబ పద్యం ఎఱ్ఱన భారతంలోని అరణ్యపర్వంలో (4-216) ఉంది. అయితే పోతన పద్యాలపై, భాగవతంపై అంత జ్ఞాపకశక్తి ఉన్న శ్రీ వేణుగోపాలరెడ్డి పద్యాసక్తిని శ్రీ ప్రతాపరెడ్డి ప్రశంసిస్తుంటారు.

'రాముడె నాకు స్నానమగు...' అనే శ్రీ విశ్వనాథ పద్యం శ్రీ ప్రతాపరెడ్డి అప్పుడప్పుడు పాడుతుంటే శ్రీ వేణుగోపాలరెడ్డి ధారణ చేసి తాను పాడుకోవడం ప్రారంభించారు. అంతేగాక శ్రీ ప్రతాపరెడ్డి భర్తృహరి సుభాషితాల విషయం, దాశరథి పద్యాల విషయం ప్రస్తావించినప్పుడు ఆ పుస్తకాలు అప్పటికప్పుడు కొనుక్కొని అవి చదవడం మొదలుపెట్టారు. ఈ వయస్సులో అందులోని పద్యాలు కూడా వారు ధారణ చేశారు. అంతేకాకుండా దేవీ భాగవతం కూడా వారు పారాయణం చేసేవారు.

భగవద్గీత, శ్రీ విష్ణు సహస్రనామాలు, లలితా సహస్రనామాలు మొదలైనవి పారాయణం చేసేవారు. గణపతి దేవాలయంలోగాని, మరెక్కడైనా గాని వీటిపై ఆధ్యాత్మికోపన్యాసాలుంటే వెళ్లేవారు.



## ఈ గ్రంథ రచయితతో పరిచయం :

ఇటువంటి సందర్భాల్లోనే ఈ జీవితచరిత్ర గ్రంథ రచయితకు కూడా శ్రీ ప్రతాపరెడ్డి వల్లనే పరిచయం ఏర్పడింది. ఆయన నా దృష్టిలో పితృసమానులుగా పూజ్యులుగా కనిపిస్తున్నారు. నేను గణపతి దేవాలయంలో గణపతి ఉత్సవాల సందర్భంగా, శ్రీ రామనవమి సందర్భంగా, టిటిడి ధర్మ ప్రచార పరిషత్తు వారు ఏర్పాటు చేసిన ఆధ్యాత్మిక ప్రసంగాల పరంపర సందర్భంగా, విజయదశమి శరన్నవరాత్రుల సందర్భంగా చేసిన ప్రసంగాలు విన్నారు. ఓసారి రుక్మిణీ కల్యాణం పురాణ ప్రవచనం చేయగా విన్నారు. పురాణ విజ్ఞానం గురించి ఓ స్వామి వారీ కథ చెప్పారని నేను ప్రాస్తావికంగా చెప్పిన ఈ పిట్టకథకు వారు స్పందించారు.

*"ఓ పౌరాణికుడు ఓ దేవాలయ ప్రాంగణంలో 39 రోజులు పురాణం చెప్పాడు. ప్రతిరోజు వస్తున్న ఓ పండు ముసలిని చూచి ఆ పౌరాణికుడు ఆనందం పట్టలేక, ఆయనకెంత శ్రద్ధ రోజూ వస్తున్నారు.. అన్నాడు నిర్వాహకులతో.*

*'మీరిన్ని రోజులు చెప్పిన పురాణంలోని ఒక్క ముక్క కూడా ఆయన చెవిలో పడలేదు. ఎందుకంటే ఆయనకు బ్రహ్మజెముడు'.... అన్నారు నిర్వాహకులు.*

*మరెందుకు వస్తున్నట్టు... పౌరాణికుడు ఆశ్చర్యపోయాడు. ఆ మరుసటి రోజుతో పురాణం ముగిసింది. 40 రోజులు ఇంత శ్రద్ధతో వచ్చి కూచొని, వెళ్లేప్పుడు పూవో, పండో, పత్రో పెట్టి వెళ్ళిపోతున్న అతణ్ణి అడుగాలనిపించింది. అందుకని ఓ చిట్టీ వ్రాశాడు.*

*'స్వామీ! ఈ నలబై రోజులు నేను చెప్పిన ఒక్క ముక్క కూడా మీకు వినిపించలేదని తెలిసింది.... అయినా ఇంత శ్రద్ధ ఏమిటి స్వామీ!' -*

*ఆ చిట్టి ఆ తాతగారు చదువుకొన్నారు. ఇలా అన్నారు.*

*'నాయనా! ఈ పురాణాల్లోని విజ్ఞానం నాకు తెలుసు. నా కొడుకూ కోడలు ఇటువైపే రారు. పైగా నిత్యం ఉత్పత్తి ... సంపాదనల్లోనే వారు మునిగిపోయి వుంటారు. ఈ నా మనుమడూ - మనుమరాలును కూడా వారు పట్టించుకోరు. నేనీ పురాణానికి*

గానీ, ఆలయానికి గాని వస్తుంటే, ఆ ముసలోడు ఎక్కడ పడిపోతాడో అని నా వెంబడి ఈ యిద్దరిని పంపిస్తారు. నేనిక్కడ ఉన్నంతసేపు నా మనుమడూ - మనుమరాలు బుద్ధిగా నా పక్కనే కూచొని వింటారు. నేను వస్తున్నది నా కొరకు కాదు; ఊరు దూరమై కాడు దగ్గరైన నేను కొత్తగా తెలుసుకొనేదేమున్నది? నేను వస్తున్నది... ఈ మనుమడూ మనుమరాలు కొరకే! అన్నారు తాతగారు.

కళ్లల్లో ఆనందబాష్పాలు ఉబికి వస్తుండగా ఆ పౌరాణికుడు, ఆ తాతగారి కాళ్ళకు నమస్కరించాడు.'

ఉపన్యాసంలోనో, పురాణ ప్రవచనంలో భాగంగానే నేనీ పిట్టకథ చెప్పాను. నేను బయలుదేరుతున్నప్పుడు 'బాగుంది ఈ కథ' అన్నారు శ్రీ వేణుగోపాలరెడ్డి. అందులోని తాతగారు మీరేనంటూ వెళ్లిపోయాను నేను.

## శ్రీ కందాళ లక్ష్మీనారాయణ రెడ్డితో అనుబంధం :

విజయగణపతి దేవాలయం నిర్వహణ కమిటీలో ఒకరైన శ్రీ కందాళ లక్ష్మీనారాయణ రెడ్డితో శ్రీ వేణుగోపాలరెడ్డి పరిచయం సాన్నిహిత్యాన్ని పెంచింది. ఆలయం, భాగవత భక్తి ఇద్దరినీ సన్నిహితం చేశాయి. పైగా శ్రీ లక్ష్మీనారాయణ రెడ్డికి ఉన్న వాస్తు శాస్త్ర పరిజ్ఞానం శ్రీ రెడ్డిలో జిజ్ఞాసను పెంచింది. తన కొడుకుల ఇండ్లు, కూతురు ఇల్లు శ్రీ లక్ష్మీనారాయణ రెడ్డిగారికి చూపించి వాస్తుపద్ధతిననుసరించి మార్పులు చేయించే ప్రయత్నం చేశారు.

శ్రీ లక్ష్మీనారాయణ రెడ్డి సరస్వతీ విద్యాపీఠం వారి అనేక పాఠశాలలు వాస్తు పద్ధతిలో ఉండేట్టుగా కృషి చేసినవారు. ఈ రంగంలో వారి సలహాలెందరో పాటిస్తుండేవారు. శ్రీ వేణుగోపాలరెడ్డి గారు కూడా తమ కుటుంబంలోని అందరికీ వాస్తు శాస్త్ర పద్ధతి ఎలా అనుసరించాలో చెబుతూ తమ ప్రయత్నం తాము చేశారు.

ఎనబయ్యోపడిలో ఉండి కూడా ఈ తాపత్రయమెందుకు అని అప్పుడప్పుడు వారికి అనిపించేది. అయితే పద్ధతి పద్ధతే అన్నది వారి నమ్మకం. ఏవైనా అనుకొన్న పనులు జరుగనప్పుడు వాస్తునెందుకు దూషించాలి అని వారంటుండేవారు. శాస్త్రాన్నీ, భాగవత తత్త్వాన్నీ, జీవితంలో నియమనిష్ఠలను నమ్మిన పెద్దతరం వారి వ్యక్తిత్వాలవి.



## శ్రీపాద బాలా ప్రసాద్‌తో అనుబంధం :

ఇప్పుడు చెప్పుకొన్న ఇంతమంది శ్రీ రెడ్డిగారికన్నా చిన్నవాళ్ళు. కాని వారికంటే ఒకటి రెండు సంవత్సరాలు వయస్సెక్కువున్న శ్రీ శ్రీపాద బాలాప్రసాద్ గారితోను వారికి అనుబంధమేర్పడింది. సైంటిస్టులు, మహాకవులు, మహా రచయితలు పుట్టిన వంశం శ్రీ శ్రీపాద వారిది. శ్రీ బాలా ప్రసాద్ ఘన వైద్యులు; ఆయుర్వేదంలో దిట్ట. వైద్యం గూర్చి బాగా తెలిసినవారు. తత్త్వ శాస్త్ర, మంత్ర శాస్త్రాలు తెలిసినవారే కాక రాజనీతి శాస్త్రం తెలిసిన ఆంగ్ల ఆంధ్ర సంస్కృత భాషా పాండిత్యం ఉన్న మేధావి శ్రీ బాలా ప్రసాద్.

పైగా హాస్యప్రియులు. హ్యూమరసం తెలిసిన వారు. వారి నోటిగుండా పటేల్, నేతాజీ, గాంధీ, నెహ్రూల మాటలు కొటేషన్సుగా వెల్వడేవి. నమకచమకాలు, శివానందలహరి, సౌందర్యలహరి అలవోకగా అర్థయుక్తంగా చెప్పే శక్తి వారికుంది. అందువల్లనే ప్రార్థనాదికాల్లో విజయ గణపతి దేవాలయంలో అర్చకులతో పాటు వారూ నమక చమకాలు - మంత్ర పుష్పం అందుకొనేవారు.

వీరు జ్ఞాని - జ్ఞానయోగంలో సాగుతున్నవారు. శ్రీ వేణుగోపాలరెడ్డి భక్తియోగంలో నడుస్తున్నవారు. ఆ జ్ఞానికి ఈ భక్తులు ఏలకులు, లవంగాలు ఇస్తుండేవారు. వారు సరదాగా సంతోషంగా తీసుకొంటూ ఇది భక్తి సుగంధం అంటుండేవారు. శ్రీపాద బాలా ప్రసాద్ గారితో ఈ పెద్దలందరు కలిసి ఉంటే అదో జ్ఞానవృద్ధ సమావేశంగా ఉండేది. పలిత కేశాల జ్ఞానరజతం ప్రకాశించేది.

## శ్రీ శ్రీధరరెడ్డితో ఆత్మీయత :

శ్రీ మంచిరెడ్డి వేణుగోపాలరెడ్డి కారణంగానే విజయగణపతి దేవాలయం భాగవత భక్తుల సమాగమ కేంద్రంగా మారిందనడంలో అతిశయోక్తి లేదు. అటువంటి వారిలో యోగి అరవింద తత్త్వ చింతకులైన శ్రీ శ్రీధరరెడ్డి గారొకరు. భాగవత కృష్ణుని చర్చ వచ్చినప్పుడు శ్రీ వేణుగోపాల రెడ్డి 'నల్లనివాడు పద్మ నయనమ్ముల వాడు, కృపా రసమ్ముపై చల్లెడువాడు...' అని పోతన్న పద్యం గుర్తు చేసేవారు. యోగి అరవిదులు శ్రీ కృష్ణుని గురించి ఏం చెప్పారో శ్రీ శ్రీధర్‌రెడ్డి గుర్తు చేసేవారు.

'మన కృష్ణుడు బాలుడు, హాస్యప్రియుడు, విలాసి, ప్రేమమయుడు. క్రీడించడం అతని ధర్మం. యూరోపు భగవంతుడు ఎప్పుడు నవ్వడు, క్రీడింపడు. అలా చేస్తే అతని గౌరవానికి భంగం కలుగుతుంది.'

'భారతజాతికే ఒక ఆత్మ ఉన్నది; సజీవమైన వ్యక్తిత్వమున్నది; మనిషిలోని చైతన్యాత్మలాగానే ఈ జాతికీ చైతన్యాత్మ ఉంది...'

ఇది చాలా లోతైన చర్చ. భక్తి పరిధిని దాటిన పరమ చైతన్యం.

భక్తి సంప్రదాయం కంటే యోగ సంప్రదాయం, ధ్యానం గొప్పదని శ్రీ శ్రీధరరెడ్డి అనేవారు. ముక్తి పొందాలంటే భక్తే గొప్పది అని శ్రీ వేణుగోపాలరెడ్డి అనేవారు.

'నీ శరీరం నీవు కాదు; నీవు దేహం కాదని, ఆత్మ అనీ, చైతన్యమనీ తెలుసుకొన్నవారు మీలాగా పట్టె నామాలు పెట్టరు. ఆత్మయే నీవైనప్పుడు ఈ నామాలెందుకు? పైగా ఈ సుగంధ ద్రవ్యాలెందుకు? ఏలకులు మొదలైన సుగంధ ద్రవ్యాలు పంచడం వల్ల భక్తి పెరగదు కదా! చెదరిపోతుంది. భక్తికి ఏకాగ్రత అవసరం; జ్ఞానానికి శ్రద్ధ అవసరం...' ఇదీ శ్రీ శ్రీధరరెడ్డి వాదన.

'ప్రతివ్యక్తి హఠాత్తుగా జ్ఞానికాడు. గురుబోధ ఎవరికైనా అవసరం. ముప్పయ్యేళ్ల క్రితం నాకు గురూపదేశం జరిగింది. ఆ భక్తి మార్గంలో నేను నడుస్తున్నాను. శ్రీ, కాళం, హస్తి కన్నప్పలకున్న భక్తి చాలు ముక్తికి. మీది జ్ఞాన మార్గం. మాది భక్తి మార్గం...' అని శ్రీ వేణుగోపాలరెడ్డి సమాధానం.

భాగవతంలో భక్తితోపాటు జ్ఞానం కూడా ఉంది. భారతీయ సనాతన ధర్మం కర్మ భక్తి జ్ఞానాల నిలయం. ఏ మార్గమైన మానవుణ్ణి దివ్యునిగా మార్చడానికే.

ఇలా ఆలోచించే శ్రీ వేణుగోపాలరెడ్డి వేయి పున్నమల పండుగ వైపు పయనిస్తున్నారు. ఆ పయనంలో ఇవన్నీ గుర్తుకు వస్తున్నాయి. వినయనగర్ కాలనీ, విజయ గణపతి దేవాలయం, అక్కడ కలిసే భాగవత మార్గానుయాయులు అందరూ గుర్తుకు వస్తున్నారు. వీరందరిని 2003 జనవరి 5వ తేదీ నాడు ఉత్సవానికి ఆహ్వానించారు శ్రీ వేణుగోపాలరెడ్డి గారు.



## కాని విధి లీల :

మనిషి ఒకటి అనుకొంటాడు.

దైవం ఇంకొక విధంగా చేస్తాడు.

వేయి పున్నమల పండుగ చేసుకోబోతున్న 82-1/2 సంగల శ్రీ వేణుగోపాలరెడ్డి విషయంలో ఇదే జరిగింది.

నిరంతర భాగవతాధ్యేత అయిన ఆయనకు పరీక్షిత్తు చివరి దశ తెలుసు. వేటకు వెళ్ళిన రాజు పరీక్షిత్తు దాహం తీరక, ధ్యానంలో ఉన్న శమీక మహాముని తనకు నీళ్ళివ్వలేదన్న కోపంతో అతని మెడలో చచ్చిన పామును వేసి వెళ్ళిపోయాడు. తన తండ్రి మెడలో పాము వేసిన పరీక్షిత్తు నేటికీ ఏడవ రోజున తక్షకుడనే పాము కరచి మరణిస్తాడని శపించాడు.

మంచి నీళ్ళివ్వలేదనే కోపంతో చేసిన ఇంత చిన్న నేరానికి నీవు ఆ మహారాజు చావునే కోరడం సమంజసం కాదని, ఈ విషయం ఆ రాజుకు తెలియచేయ వలసిందంటాడు. ఆ విధంగానే శృంగి తెలియచేస్తాడు. పరీక్షిత్తు పశ్చాత్తాప తప్తుడవుతాడు. ఈ యేడురోజుల్లో నేనేం చేస్తే ముక్తికి వెళతాను అని పండితులను ఋషీశ్వరులను అడుగుతాడు. అప్పటికే భాగవత ప్రచారం చేస్తూ వస్తున్న శుకయోగి అక్కడికి వస్తారు. రాజుగారి ఆవేదనను తెలుసుకొంటాడు. భాగవతం వినవలసిందని అంటాడు. అలా వినని వాడు చదవని వాడు ప్రాణం లేని కట్టె అంటాడు.

'ఏను మృతుండనౌదునని యింత భయంబు మనంబులోపలన్
మానుము, సంభవంబుగల మానవకోటికి చావు నిత్యమౌ
కాన హరిం దలంపుమిక కల్గదు జన్మము నీకుధాత్రిపై
మానవ నాథ! పొందెదవు మాధవలోక నివాస సౌఖ్యముల్...'

- నేను మరణిస్తానని ఎందుకు భయపడాలి. మనస్సులో ఈ ఆలోచనే అవసరం లేదు. పుట్టుక ఉన్న మనిషికి చావు నిత్యం. అందుకే ఇక విష్ణువును తలచుకో! దానివల్ల ఇకనీకు ఈ భూమ్మీద మళ్లీ పుట్టుక ఉండదు. అంతేగాక! ఓ రాజా! నీవు ముక్తిని పొందుతావు.

భాగవతం ముక్తి, ముక్తి భాగవతం. ఇదే శ్రీ వేణుగోపాలరెడ్డి మనస్సులో తిరుగుతుంది. ఉపాధి (శరీరం)తో ఈ మందిలో తిరుగుతున్నా ఆయన మనస్సులో అదే ఉంది.

అటువంటిది ఈశరీరానికి ఈ ఉత్సవం. అమృతోత్సవం. మృతుడు కాకుండా ఎవరైనా ఉంటాడా !

అప్పుడే ఆయనకు ఎడమచేయిలాగడం, ఎడమభుజం నొప్పిగా ఉండడం ప్రారంభమయింది.

ఆ రోజు గురువారం, 2002 డిసెంబర్ 27వ తేది. ఇలా నొప్పిగా ఉంటుందంటే, ఎప్పుడూ చూపించుకొనే డాక్టర్ గారి దగ్గరికి వెళ్లుదామన్నారు. ఇంటిల్లిపాది. శ్రీ సంపత్కుమారాచార్య కూడా డాక్టరు దగ్గరికి వెడదామన్నారు.

"ఇప్పుడేం అవసరం లేదు. రేపు నా కొడుకూ, కోడలు యు.ఎస్.ఎ నుండి వస్తున్నారు. కోడలు డాక్టర్ గీత; ఇక్కడ డాక్టర్లను సంప్రదిస్తున్నా కోడలు సలహా ప్రకారమే మందులు వాడుతున్నాను. రేపుదయమే ఆమె వస్తుంది. ఏం మందులో ఆమె చెపుతుంది.....' అన్నాడు వేణుగోపాల రెడ్డి.

అనుకున్నట్టుగానే 28 డిసెంబర్ శనివారంనాడు కొడుకు రవీందర్ రెడ్డి, కోడలు డాక్టర్ గీత, మనుమడు, మనుమరాలు వచ్చారు. జనవరి ఐదవ తేది నాటి కార్యక్రమాలు చేయాల్సిన పనుల గురించి చర్చించారు. శనివారం ఆదివారం అంత నలతగాలేదు. కాని వీపున ఎడమవైపున ఏదో నొప్పిగా ఉంది. మనిషి వంగిపోతున్నాడు. 30వ తేది సోమవారం కూడా గడిచిపోయింది. రోజూ వాడే మందులే వాడుతున్నారు. మనుమడూ మనుమరాలు ఏవేవో చెబుతుంటే వింటున్నారు.

మంగళవారం 31వ తేది; వేయి పున్నముల పండుగ ఇక నాలుగురోజులే ఉంది. మన ఇండ్లల్లో ఇంతవరకు ఎవరూ ఈ అమృతోత్సవ సహస్రమాస చంద్రదర్శనం చేసుకోలేదు. ఇది ఘనంగా చేద్దాం అని అందరూ ఉత్సాహంగా అంటున్నారు; వింటున్నారు; ఎవరెవరేయే పనులు చేయాలో నిర్ణయించుకొంటున్నారు.



సాయంకాలం 3గం. 30 ని. ల సమయం. అప్పుడు తీవ్రంగా గుండె నొప్పి వచ్చింది. మెల్లగా వాలిపోయారు శ్రీ వేణుగోపాలరెడ్డి. ఎప్పుడూ సంప్రదించే డాక్టర్కై చూశారు. ఆ తర్వాత మలక్ పేట సి.డి.ఆర్. అక్కడి నుండి హిమాయత్‌నగర్ సి.డి.ఆర్. రాత్రి అంతా పరీక్షలు. వైద్య సేవలు, పేస్ మేకర్, హార్ట్ పంపింగ్.....

2003 జనవరి 1వ తేది ఉదయం 9 గం॥ 15 ని॥ కు .......... వారి జీవయాత్ర ముగిసింది. 9 గం॥ 30 ని॥ వరకు అందరికీ తెలిసిపోయింది.

జాతస్య మరణం ధ్రువమ్...
పుట్టిన ప్రతివ్యక్తీ గిట్టక తప్పదు.

ఆరోజు సాయంకాలం ఎలిమి నేడులో అంత్యేష్టి జరిగింది. వేలాది మంది; ఊరికి ఊరే శోకసాగరంలో మునిగి పోయింది.

శ్రీ మంచిరెడ్డి వేణుగోపాల రెడ్డి జీవన యాత్ర ముగిసింది. కాని వారి భాగవత ముద్రలు మిగిలిపోయాయి.

రామ రామయన్న రారాదు పాపంబు
రామ రామయన్న రాదుభయము
రామ రామయన్న రారాదు మృత్యువు
రామనామ మమృత రాశియగును.

ఓం తత్ సత్

హరే రామ హరే రామ  రామ రామ హరే హరే ।
హరే కృష్ణ హరే కృష్ణ  కృష్ణ కృష్ణ హరే హరే ॥

రాముడె నాకు స్నానముగు
రాముడె నాకు జపంబు ధ్యానమున్
రాముడె ఎల్ల నా బ్రతుకు
రాముడె నన్ను కన్నతండ్రి, ఈ
రాము వినా నిమేషమవురా!
మన జాలను కాదయేనియున్
రాముని వీడి యీ యఖిల
రాజ్యము గైకొనరాదె కైకయీ!

(విశ్వనాథ వారి కల్పవృక్షం నుండి)



# మహా మృత్యుంజయ మంత్రం

ఓం త్ర్యంబకం యజామహే
సుగంధిం పుష్టి వర్ధనమ్ ।
ఉర్వారుక మివ బంధనాత్
మృత్యోర్ముక్షీయ మామృతాత్ ॥

దోసకాయను తొడిమ నుండి సులభంగా త్రుంచివేసిన విధంగా, మృత్యుబంధం నుండి మమ్ములను ఉద్ధరించి అమరత్వాన్ని ఇవ్వవలసినదిగా, సర్వ జీవుల పోషణకర్త దివ్య పరిమళ దేహుడైన ఆ మూడు కన్నుల వానిని ఆరాధిద్దాం.

(ఈ మంత్రాన్ని నిరంతరం జపిద్దాం, స్మరిద్దాం, తరిద్దాం)

హరిః ఓం తత్ సత్

# వేమనయోగి సూక్తులు



1. అజ్ఞానమే శూద్రత్వం; సుజ్ఞానమె బ్రహ్మం
2. ఇంటి యాలి విడిచి యిల జారకాంతల - వెంట దిరుగువాడు వెర్రివాడు
3. ఎంత చదువు చదివి ఎన్నియో విన్నను - హీనుడవగుణంబు మానలేడు
4. ఎలుకతోలు తెచ్చి ఎందాకనుదికినా - నలుపు నలుపెగాని తెలుపుగాదు
5. గురువునకును పుచ్చుకూరైన నీయరు - అరయ వేశ్య కిత్తురర్థమెల్ల గురువు వేశ్య కన్న గుణహీనుడేమొకో.
6. ఓర్పులేని భార్య యున్న ఫలంబేమి - బుద్ధిలేని బిడ్డ పుట్టియేమి సద్గుణంబు లేని చదువది యేలరా!
7. కనులు పోవు వాడు కాళ్లు పోయినవాడు -ఉభయులరయుగూడియుండినట్లు పేద పేద గూడిపెనగొని యుండును
8. గంగిగోవు పాలు గంటెడైనను చాలు - కడవెడైనను నేమి ఖరము పాలు భక్తి గలుగు కూడు పట్టెడైనను చాలు
9. చెడ్డవాని మిగుల చెఱుచును దైవంబు - అడ్డపడడు వాని కాపదైన చెడ్డ చేను జూచి రెడ్డి తామెచ్చునా!
10. తప్పులెన్నువారు తండోపతండంబు - ఉర్వి జనుల కెల్ల నుండు తప్పు
11. తనకు ప్రాప్తిలేక దానము చిక్కదు - దైవనింద వెట్టితనము గాదె.



# స్వామి శివానందుల సూక్తులు

1. ఒకవేళ మీరు బ్రహ్మ సాక్షాత్కారాన్ని సాధిస్తే అది కేవలం మీ బౌద్ధికాన్వేషణమే కాదు, అది ఆధ్యాత్మిక విజయమే అవుతుంది.
2. ఈశ్వరునిపైన కప్పుకొని ఉన్న మాయ ఆవరణాన్ని శ్రద్ధ మాధ్యంగా తొలగించండి. ఇప్పుడు ఆయనతో సంబంధాన్ని స్థాపించుకొండి; కలిసి పొండి! ఇదే మీ పరమగమ్యం.
3. శ్రద్ధ లేకుండా చేసే ప్రార్థన అరణ్యరోదన.
4. సహృదయంతో మీరు మహాత్ములవుతారు; లేకపోతే దానవత్వం కొంగు పట్టుకొని పశువుల దొడ్డిలో ప్రవేశిస్తారు.
5. నామ రూపాల నాటకం పూర్తి అయిన వెంటనే బ్రహ్మవిద్య అవతరిస్తుంది.
6. 'నీ స్వరూపం తెలుసుకో' - ఇదే నీ బౌద్ధిక శక్తి.
7. నీలో దివ్య గుణ సంపద పెరిగినప్పుడు, మనస్సు విషయ సుఖాలకు దూరమవుతుంది.
8. ఈశ్వరునిలో అన్ని ప్రాణులున్నాయి. అన్ని ప్రాణుల్లో ఈశ్వరుడున్నాడు.
9. సూర్యోదయ కాంతితో పూలరెక్కలు విచ్చుకొంటాయి. అదే విధంగా మీరు ఈశ్వరుని ముందు మీ హృదయం రెక్కలు విచ్చుకోనివ్వండి.
10. జ్ఞానాగ్నిలో శుద్ధుడై సాధకుడు పరమాత్మ పదాన్ని పొందుతాడు.
11. వాసన అనే అగ్ని నీ అంతఃకరణాన్ని కాల్చివేస్తుంది.

# మహర్షి మలయాళస్వామి సూక్తులు

1. ఏకాగ్రంగా ఉండే సూక్ష్మబుద్ధి చేత ఆత్మను అర్థం చేసుకోవాలి.
2. భారతదేశం అభివృద్ధి చెందాలంటే బ్రహ్మవిద్య అందరికీ అందుబాటులో ఉండాలి.
3. ఇంద్రియాలనూ, మనస్సును నిగ్రహిస్తే, ఆత్మలోనికి మనస్సు ఎటువంటి విషయాలను తీసుకొని రాలేదు.
4. స్వరాజ్య కాంక్ష ఉన్నవారు, స్వారాజ్యంపై అభిలాష కలవారు మాతృదేవత అయిన సంస్కృత భాషను ఉద్ధరించాలి.
5. ధ్యానమనేది దివ్యౌషధం. దానివల్ల వచ్చే ఫలితం మానసిక శాంతి. ధ్యానం వదిలితే సంసారంలో చిక్కులు, అశాంతి తప్పవు.
6. యోగమంటే జీవాత్మ పరమాత్మ ఐక్యం.
7. ప్రతి రోజూ ఏదైనా దైవకార్యం చేసిన తర్వాతనే భుజించాలి.
8. ప్రకృతి అనే ప్రవాహం వస్తుంది, పోతుంది. అటువంటి శీతోష్ణాదులే ద్వంద్వాలు; వీటికీ శబ్ద స్పర్శాది విషయాలకు లొంగక స్థిరునిగా, నిశ్చలముగా, అసంగంతో ఉండేవారే ద్వంద్వాతీతులు.
9. కాషాయ వస్త్రము ధరించినంత మాత్రంలో సన్న్యాసులు కారు. ఆత్మ సన్న్యాసమే ప్రధానం.
10. మధు మాంసాదులు సేవించేవారు, రాక్షస భోగులే కాని రాజభోగులు కాదు.
11. వివిధ మతములు, వివిధ సంఘములు భారతదేశములో వేరువేరుగా చీలిపోవుటయే దేశము పరులపాలయ్యింది. శరీరము నుండి ఒక్కొక్క అంగం విడిపోరాదు కదా!



# శ్రీ శ్రీ శ్రీ చిన్నజీయరు స్వామి వారి సూక్తులు

1. జీవుడు పరమాత్మ దగ్గరకు వెళ్లేదాకానే శాస్త్రం అంతేకాని తరువాత శాస్త్రంతో పనిలేదు.
2. మొదట స్వరూపం తెలిస్తే సంబంధం తెలుస్తుంది. సంబంధం తెలిస్తే ప్రేమ కలుగుతుంది.
3. భగవంతుని చేరాలంటే పుణ్యపాపాలు రెండూ అడ్డే. ఇవి రెండు పోతే తప్ప ఆయనను చేరలేము. ఆయన తప్ప ఎవరూ తొలగించలేరు.
4. భగవంతుని జన్మ కర్మలు దివ్యమైనవి. ఆయన కృపకు పరవశుడు. మనం కర్మకు పరవశులం.
5. ఏ జన్మలో భగవంతుని గుర్తిస్తే అది అంతిమ జన్మ అవుతుంది వానికి.
6. ఆత్మకు మంత్రం తల్లి; ఆచార్యుడు తండ్రి.
7. ఆచార్యుడు అనే గాలాన్ని పంపి భగవంతుడు మనిషిని ఉద్ధరిస్తాడు.
8. సత్పురుషుల సహవాసం సాయంకాలపు ఎండలాంటిది. నీడ పెరుగుతుంది కాని తరగదు.
9. లౌకికమైన కోరికలు ఎన్ని పొందితే అంతగ అవి పెరుగుతూనే ఉంటాయి. అనుభవిస్తున్న కొద్ది ఆశ మరింత వాటిపై పెరిగి, స్వార్థం, పరహింసలను ప్రోత్సహిస్తాయి. మన దృష్టిని అంతర్ముఖం కానివ్వవు.
10. వంద చేతులతో ఆర్జించాలి. వెయ్యి చేతులతో వితరణం చెయ్యాలి.
11. భగవంతునికి ఉపచారాలన్నీ ప్రేమతో చేయాలి. దానికి కావలసినది ఆర్ద్రత గల మనస్సు.